# సరస్వతీ మహల్

యామినీ సరస్వతి



శ్రీధర్ పబ్లికేషన్స్
హైదరాబాద్

సోల్ డిస్ట్రిబ్యూటర్స్
ఐయాడ్స్, గుంటూరు.

సరస్వతీ మహల్ సాహిత్య పరిచయ వ్యాసావళి
యామినీ సరస్వతి

***SaraSwathi Mahal*** A Literary Intro Sketchs
By
***Yaminee Saraswathi***

ముఖపత్ర చిత్రాలంకరణ : చంద్ర

ప్రతులు : వేయి

ప్రథమ ముద్రణ :
చైత్రం, ప్రజోత్పత్తి, మార్చి 1991

వెల : 18-00

పేజీలు : 128+8+4

ప్రచురణ :
శ్రీధర్ పబ్లికేషన్స్
చిక్కడపల్లి, హైదరాబాద్-500 020

SOLE DISTRIBUTORS
EYE ADS, Opp. GANDHI STATUE,
KORITIPADU-CENTRE GUNTUR-522007.

తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్,
వారి ఆర్థికసహాయంతో ప్రచురితం

ముద్రణ :
చిట్టారెడ్డి ప్రింటర్స్, నారాయణ గూడ, హైదరాబాద్.
కవరుపేజీ : వి. జి. పి. ఆఫ్‌సెట్ ప్రెస్, సికింద్రాబాద్
ఫోన్ : 823163

# వందన



విశ్వరూపా విశ్వదీపా

విశ్వరక్షా విశ్వమోక్షా

విశ్వకర్తా విశ్వభర్తా

విశ్వంజీ

సద్గురుం నమః

# అభివందనం

శతాధిక చిత్ర దర్శకులు

[గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్]

నా శ్రేయః కాములు

నా చలన చిత్ర రంగ ప్రవేశ కారకులు

విశ్వామిత్ర టి. వి. సీరియల్ స్క్రిప్టు రచనతో

విస్తృత విశేష ఖ్యాతి సమకూర్చిన మదభిమానులు

దర్శకరత్న కళాప్రపూర్ణ

దాసరి నారాయణరావు గారికి

ప్రేమాభివందనాలు

-యామినీ సరస్వతి

# అంకితం



శ్రీ గెలివి వెంకట సుబ్బయ్య

శ్రీమతి గెలివి వెంకట సుబ్బమ్మ గారల

(నంద్యాల, కర్నూలు జిల్లా)

దివ్యస్మృతికి

-యామినీ సరస్వతి

# ధన్యవాదాలు

ఉదయం ఆదివారం అనుబంధంలో ధారావాహికంగా ప్రకటించిన సంపాదక మండలికి,

తమ తల్లిదండ్రులపేర స్మృత్యంకితం చేయించిన, సూరన సారస్వత సంఘం అధ్యక్షులు, డా॥ గెలివి సహదేవుడు గారికి,

చేయూత ఇచ్చిన 'ఉజ్జ్వల' తారగా వెలుగొందుతున్న మిత్రులు మందడి కృష్ణారెడ్డి గారికి,

మా గ్రామ సమీప గ్రామవాసి, వాసి కెక్కిన రియల్ ఎస్టేట్స్ వ్యవహర్త, మిత్రుడు శ్రీ ఎన్. హెచ్ సి. శివారెడ్డి, శ్రీ లక్ష్మి ప్రియ ఎస్టేట్స్, బాబూఖాన్ ఎస్టేట్స్ హైదరాబాద్ గారికి,

మిత్రుడు పాశం వేంకటేశ్వర రెడ్డి గారికి

అడుగడుగునా వెన్నుతట్టి ప్రోత్సహించి 'సరస్వతీ మహల్' పుస్తకరూపకల్పన చేసిన ఆత్మీయులు తెలుగు విశ్వవిద్యాలయం సేవా విస్తరణ విభాగం అధికారి డా॥ సుదర్శన్ సింగ్ గారికి హార్దిక సహాయం చేసిన కునుంపూడి నాగరాజు, (కంట్రాక్టర్, ఖాజీ పాలెం గుంటూరు జిల్లా) గారికి కొమరగిరి రామ్మూర్తిగారికి

ముద్రణ భారం వహించి నిర్వహించిన శ్రీ పి. సుభాష్ నాయుడు, చిట్టారెడ్డి ప్రింటర్స్ శ్రామిక బంధువులకు

చిరంజీవి కొండపనేని నరసింహారావుకు, శ్రీ కే. బి. ఆదిత్యకు, కొండపనేని శంకరరావు గారికి శ్రీ ఎం. హెచ్.వి. సుబ్బారావు గారికి,

చక్కని ముఖచిత్రం గీసిచ్చిన శ్రీ చంద్రగారికి, ముఖపత్రాన్ని ముద్రించి ఇచ్చిన వి. జి. పి. ఆఫ్‌సెట్ ప్రెస్ రాజుగారికి

—యామినీ సరస్వతి

# ప్రాంజలి

పఠనానికి ప్రయోజనం పాఠం. అబగా ఆర్తిగా అలనాడు చదువుకున్న ఆంధ్ర సాహిత్యం లోని సోయగాలు సొగసులు అందచందాలు అందరికీ కాకున్నా కొందరికైనా చెప్పాలని చేసిన ఓ చిన్న ప్రయత్నం "సరస్వతీ మహల్."

ఆ యా కవుల రచనల్లోని విశేషాలు విషయాలు వాచవిగా రుచి చూపితే పాఠకులే పరుగులు తీసి వాటిని పడి పడి చదువుతారని ఆశించి చేసిన పరిచయ వ్యాస సంపుటి సరస్వతీ మహల్.

నేను పొందిన అనుభూతిని ఆత్మీయులతో పంచుకోవాలని చేసిన రచన ఇది. ఇది చదివిన తెనుగు రసిక పాఠకులు ఆ యా ప్రబంధ గ్రంధ సుగంధాలను ఆస్వాదిస్తే నా కృషి ఫలించినట్లే తలుస్తాను.

గ్రంథాలయంలో వర్ణనాత్మక పట్టిక లాంటిదిది. అంతే !

సహృదయులు ఆదరిస్తార్లే అనే
పూర్తి నమ్మకంతో
యామినీ సరస్వతి

# ఇదీ వరస

# దాన జపాగ్ని హోమపరతంత్రుడు

అనగా అనగా ఒక ఊరు. ఆ ఊరు మా ఊరు. మా ఊరి పేరేంటో తెలుసా ? అరుణాస్పదం. మా ఊరి పక్కనే ఓ నది ఉంది. అది వరుణ. కాశీకి మొదటి పేరేంటో తెలుసా? వారణాసి. వరుణ, అసి అని రెండు నదుల సంగమం కాబట్టి వారణాసి అంటారు. అదిగో ఆ వరుణే మా వూరి పక్కనువ్న వరుణానది.

నేను వేకువనే నిద్దర్లేస్తాను. వరుణకు స్నానానికి వెళ్లి అనుష్ఠానం తీర్చుకొని ఇంటికొస్తూ నా శిష్యుల్చేత వేదం చదివిస్తాను. మా నాన్నా. అమ్మా ఇంటి విషయాలు చూసుకొంటారు. నాకు అధ్యయన అధ్యాపన యజన యాజనాలే తప్ప మరో దిగుల్లేదు. దిగుల్లేదంటే - ఇంట్లో నాకు దీటైన సోమిదమ్మతో కాపురంలో దిగుల్లేదు. బోల్డన్ని మాన్యాలున్నాయి. అవి తెగ పండుతాయి. ఇల్లు గడవడానికి వనర్లున్నాయి. ఇంట్లో నిరతాన్నదానము. మా ఆవిడకి చాలా ఓపిక - రాత్రింబవళ్ళనకుండా అతిధి అభ్యాగతులకు వండి పెడుతూ ఉంటుంది. మరిన్ని ఉన్నా ఓ దిగులు మాత్రం ఉంది.

అదేమిటంటే - తీర్థ యాత్రలు చేయాలని !

కానీ ఇల్లును - ఇల్లాల్ని విడిచి వెళ్ళాలంటే ఎలాకుదుర్తాయి అందుకే దిగులు.

ఇలా ఉండగా ఓ రోజు -

మా ఇంటికి ఓ సిద్ధుడు వచ్చాడు. అతని రాకతో మా యిల్లు పావన మైంది అనుకున్నాం. "అయ్యా ! మీ మాటలు మంత్రాలు-మీరెక్కడ కాలుపెడ్తే

అది ప్రయాగ మీ కాళ్ళు కడిగి శిరసున చల్లుకునే "ఆకాశ గంగా జలమే" అన్నాను మనస్ఫూర్తిగా.

ఆయన చెప్పిన మాటలు వింటే ఆశ్చర్యం వేసింది.

చూస్తే వయసేమో చిన్నది. ఆయన చెప్పిన క్షేత్రాల పట్టీ పెద్దది. అవన్నీ తిరిగి రావాలంటే యెన్నేండ్లు పడుతుంది. నా సందేహం దాచుకోకుండా అడిగా.

ఆయన నవ్వాడు. రహస్యం చెప్పాడు. పాదలేపం ప్రభావంతో ఆయన ఇవన్నీ తిరిగొచ్చాడట.

నాకు ప్రాణం లే చొచ్చింది.

స్వామీ! స్వామీ నాకు ఎన్నేళ్ళనుంచో తీర్థ యాత్రలు చేయాలని ఉంది. ఈ శిష్యుని మీద దయతో అనుగ్రహించండి అన్నా.

ఆ సిద్ధుడు ముసిముసి నవ్వులు నవ్వుతూ ఇది అదీ అని చెప్పకుండా దంతపు భరణిలోని ఒక పసరు నాపాదాలకు పట్టించి వెళ్ళిపోయాడు. ఇంకేముంది? నేను —

తుహిన భూధర శృంగ శ్యామల కోమల కానన హేమాద్ర్యదరీ ఝరీ నిరీక్షాపేక్షతో బయలుదేరాను అక్కడేం చూశాను.

....అంబర చుంబి శిరస్స రఝ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
కటక చరత్కరేణు కరకంపిత సాలము శీత శైలమున్

అహో! ఏమి హిమాలయాలు! ఏమా మంచు కొండల సౌందర్యం. ఏ మందము! ఏ మందం! అరే అప్పుడే మధ్యాహ్నమైందే! ఈ ఎండకే మంచు కరిగిపోతోందే! అబ్బో చాలా ఆలస్యమైంది. ఇంటికెళ్ళాలి దేవతార్చన చేయాలి

దేవతా నివేదన చేయాలి. అమ్మా. నాన్నా ఆకలికి తట్టుకోలేరు. సోమిదమ్మ వంటంతా పూర్తిచేసి ఈయనెక్కడికి వెళ్లారో ఏమిటో ఇంకా రాలేదు ఏమిటా అని ఎదురు చూస్తూ ఉంటుంది. పాపం పిచ్చిది ఇలా హిమవత్పర్వత శ్రేణిని చూసొచ్చానని చెప్తే ఎంత అబ్బుర పడుతుందో ! అసలు నమ్ముతుందా! రేపు మళ్లీ వచ్చేటప్పుడు ఈ పసరు తీసి తన కాలికీ కొంత రాస్తే సరి తనూ వస్తుంది. ఈ వేళకిక చాలు వెళ్ళిపోదాం.

అరే !

ఇదేమిటీ ! కదల్నేమిటీ ! ఇక్కడి వాడ్ని ఇక్కడే ఉన్నావే ! ఈ పసరు పనయిపోయిందా ! అయ్యో ! ఎంత కర్మ వచ్చి పడింది.

ఎక్కడ అరుణా స్పదపుర

మెక్కడి తుహినాద్రి క్రొవ్వియె రాదగునే

అక్కట ! ముసు చనుదెంచిన

దిక్కది యని యెరుగ వెడలు తెరువెయ్యది యో !

ఎక్కడికి పోవాలి ! ఎవర్నడగాలి ! ఎలా తిరిగి చేరుకోవడం ! పరమేశ్వరా ఎంత కష్టం.

నడుస్తూ నడుస్తూ ఆగేను.

అల్లంత దూరంలో ఓ భవనం. ఓహో ! మిన్నులు పడ్డ చోటుకు వచ్చాననుకున్నాను. కానీ ఇది జనాన్వితమే - ఇదేమిటి ఈ గాలి !

మృగమద సౌరభ విభవ ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధస్ఫురితేతర పరిమళమై మగువ పొలుపు దెలుపుతూ ఉందే !

చూద్దాం అనుకుంటూ నడిచాను.... అక్కడ

....విద్యుల్లతా విగ్రహన్

శత పత్రేక్షణ చంచరీక చికురన్ చంద్రాస్య చక్రస్తనిన్

నతనాభిన్ సవలా....మరన్నారీ శిరోరత్నము ...ఓ మామిడి చెట్టు మొదట్లో అరుగుమీద....అలవోకగా కూర్చొని.... వీణ వాయిస్తోంది. అరే - వేరే మద్దెల లేదే - ఆమె చేతి కంకణాల ధ్వనే మద్దెలగా ఉందే! సగం కళ్ళు మూసుకొని ఎంత పారవశ్యంగా వుంది.

అరే! చప్పున కళ్ళు తెరిచిందే! నన్నేమిటి మిర్రిమిర్రి చూస్తోంది! అలావచ్చి పోక పట్టుకు అనుకొని నిల్చిందేవిటి. కనురెప్పపాటే లేదే! ఇటే వస్తోందే!

ఎవ్వతె - వీవు భీత హరిణేక్షణ! యొంటి జరించె దోటలే
కివ్వన భూమి .. భూసురడనే త్రోవతప్పితిన్
గ్రొవ్వున నిన్న గ్రామునకున్ జనుదెంచి పురంబుజేర నిం
కెవ్విధిగాంతు దెల్పగదనే తెరువెద్ది శుభంబు నీకగున్.

భలే! ఏమందునయ్యా అందగాడా! చారెడేసి కళ్ళున్నాయి. వెళ్ళేదారి ఎవర్నడుగుతావు! ఒంటరి దాన్నున్నానని - ఏదోసాకు పెట్టుకుని నన్ను పల్కరిస్తావే మరీ ఇంత భయం లేకుండా పలకరించేందుకు ఎంత లోకువయ్యాం అంది.

నేను నిర్ఘాంత పోయి నిల్చున్నాను.

మేం అప్సరసలం నా పేరు వరూధుని - మేం ఈ కొండల్లో తిరుగుతూ ఉంటామయ్యా నువ్వు నా అతిథివి - మా ఇల్లు - అదిగో - ఎండలో అలిసిపోయావు - రా - మా ఇల్లు పావనం చేసి మా ఆతిథ్యం స్వీకరించు అంది మళ్ళీ.

అమ్మా నేను తొందరగా మా ఊరు వెళ్లాలి! నువ్వు నాకు ఆతిథ్యమిచ్చి ఒకటి ఇవ్వాక ఒకటా! పిలిచిందే పదివేలు! నువ్వు దేవతా స్త్రీవి. నీ మహత్తుతో నన్ను మా ఊరు చేర్చు! అన్నాను.... ఏం వూరయ్యా అందగాడా! మావి రత్నాల మేడలు - ఈ నందన చందనోత్కారాలు - గంగా సైకతాలు మీ పల్లెటూరికి - వూరింటికి సాటిరావా? వూరువూరని వూరేగుతానంటావేం?

ఇదంతా ఎందుకు ! నాకు నీపై మనసైంది. రా పోదాం . అంది కాము

భలే దానివే ! నువ్వు. మేం బ్రాహ్మణులం ఇంటిదగ్గర అగ్నిహో త్రాలు చెడిపోతాయి ! మా అమ్మా నాన్నా ముసలి వాళ్ళు - నేను ఇంటికి పోక పోతే వాళ్ళు ఖోంచెయ్యరు.

ఏమిటీపిచ్చి బ్రాహ్మడివి ! యజ్ఞాలు యాగాలు మాకోసమే కదా ! ఆనందో బ్రహ్మ అని విన్లేదా ! రా ! ఆనందం అనుభవించు ! నాకు భలే కోపం వచ్చింది. చెడామడా హితువు చెప్పాను. అంటే ఏమందో తెలుసా ! వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కన కాదె యేరికిన్ అని ఇంక ఆగలేనట్టు మీదబడి కౌగిలించి ంది.

"హా శ్రీహరీ" ! అని చప్పున దూరం తోశాను. పాటునకిం లోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ నిచ్చోట భవన్న ఖాంకురము సోకె కనుం గొనుమంచు జూపి....వల వల ఏడ్చింది. ఆపై భూసురవర్య ఇంతదల పోయవు. నీ చదువు ఏల చెపుమా అంది,

నేనింకేం అంటాను—

అక్కడ్నించి వచ్చి గల గలా పారే సెలయేట్లో ఆమె కౌగిలించు కున్నప్పుడు అయిన జవ్వాది కడిగేసుకొని మాధ్యాహ్నికం వార్చి అగ్నిని స్తోత్రం చేశాను.

'ఓం అగ్ని మీళే పురోహితమ్'

ఆ అగ్ని నన్నిల్లు చేర్చాడు - హమ్మయ్యా బ్రతికి పోయాను. మళ్ళీ యాత్రలు వద్దు పుణ్యము వద్దు - ఇంతకు నన్నెవరుగా గుర్తించారు ! నేను-దాన జపాగ్ని హోమ పరతంత్రుడ్ని - ప్రవరుడిని....

యామినీ సరస్వతి

# శృంగార లహరి

పారదోలితివే సవతి పోరు తలగంగ
కూర్మి మగని పక్క జేరి గౌరి ?
అమ్మ ! నీవు మగని రొమ్మెక్క పొగులు నీ
సవతి చల్ల పరుప సాగె చెల్లి

పార్వతిని మేలమాడింది లక్ష్మి. "ఏమ్మా గౌరీ! మొగుని పక్క చేరి నీ సవతి పోరు తొలిగేలా గంగను పారదోలావా ?" సరస వంతులు సరస సంభాషణా చతురమతులు సమయం సందర్భం దొరికితే మాటలతో ఈటెలు విసరడం సహజాతి సహజం. అలా పార్వతి లక్ష్మి కలుసుకున్నప్పుడలా ఎవరో ఒకరు ఎత్తి పొడవడం - దానికి తగ్గట్టు అన్నవారి మొహం చిన్నబోయేట్టు సమాధానం మరొకరు ఇవ్వడం మామూలె. ఒకసారి "బిచ్చ గాడెక్కడమ్మా" (బిక్షుః క్వాస్తి) అని అడిగిందట లక్ష్మి. దానికి గౌరి బలిచేసే యజ్ఞం దగ్గరకు వెళ్ళాడు. (బలిర్మ ఖే) అని సరసంగా జవాబిచ్చిందట. ఆ కోవలోనే ఏదమ్మా నీ సవతి....ఆమెని పారదోలి సవతి పోరు తొలగించుకున్నావా అని అడిగిందట లక్ష్మి. దానికి గౌరి...అవునమ్మా నేనుమగనిలో సగమైతే. నువ్వు మీ ఆయన రొమ్మెక్కి కూచున్నావు. దాంతో పొగులుతున్న నీ సవతి భూదేవిని చల్లబర్చటానికి నా చెల్లి వెళ్ళింది అందిట.సాధారణంగా గంగను గౌరిని కవులు అక్కచెల్లెళ్లగా సంభావిస్తారట. సవతులుగా భావించరట. గంగను చెల్లిగా తలపోసింది గౌరి. భూదేవి ఉడుకు మోత్తనంతో 'పొగలు' తే చల్లబరిచేది గంగే (వర్షం) కదా ! ఎంత గొప్ప భావన.

ఇది ఒక ముక్తకం...రసికుడైన కవి తన కొండంత భావాన్ని గోరంత 'చిన్ని' పద్యంలో ఇమిడ్చి ప్రతిభా పాటవాన్ని ప్రదర్శిస్తాడు. హాలుని

గాథా సప్తశతి, అమరుకం అలాంటివి. ఇది ఈ 'శృంగార లహరి' ఇటీవలి (1981) కాలంలో వెలువడిన ఒక ఆణి ముత్యాల సరం. దీనిలో ఏ పద్యానికి ఆ పద్యమే ! దేనికదే గొప్ప. నాలుగు పాదాల్లో నివ్వల హరివిల్లు - అలతి అలతి మాటల్లో అసదృశ భావనకు బొమ్మ కట్టడం - చాలా 'ప్రతిభ' గల కవి 'పండించిన' గొప్ప శృంగార కావ్యం ఇది.

జోస్యం జనార్దన శాస్త్రిగారు 508 ముక్తకాలతో నాలుగు తరంగాలుగా తీర్చిదిద్దిన 'శృంగార లహరి' ప్రతి పద్య రమణీయంగా ప్రతి పదకమనీయంగా ఉంది ప్రతి పద్యాన్ని 'ఎత్తి చూపాలి' అంటే కష్టం....ఎత్తి పొడవడం మీద వి'శ్లేషించి'న పద్యం (343 పు 70) ఆలోచనామృతం.

చమత్కారాలు చేయడానికి దేవతల విషయాలు వీలిచ్చినంతగా మరే విషయాలు ఇవ్వవు అందుకే ముందుగా శాస్త్రిగారు దేవతల 'పని' పట్టారు. ఆ మీదట సాంసారికము.

ప్రాయపుసిరి పొంగువారు మేన్ బిగి జిగి
సోయగంబు లొలుకు తోయజాక్షి

కలువ కన్నుల బాల ఆ బేల - ఆమెమేనుబిగి - పటుత్వము - జిగి జగజగామెరిసే అందం - అవేకాక ఆమె ప్రాయం - ఎలాఉంది ? ఆ ప్రాయపు సిరిపొంగువారుతూ ఉంది. అందమూ చెప్పతరంకాదు. కన్నులా కలువ కన్నులు ఇక యవ్వనమా? విరిసి విరిగి పొంగి పొర్లుతుంది జిగిబిగి ఉంది— ఇక అలాటి అందగత్తెను—చూడ,

తోడనిలువ, సుంత తోడ్పడ పలకరింపు బుద్ధిపుట్టునెవనికైన అంటారు శాస్త్రిగారు. బ్రహ్మకైన పుట్టురిమ్మ తెగులు అన్నరీతిగా అన్నారు. అంతోటి బిబ్బోక వతిని చూడాలని, తోడు నిలవాలని, కొంచెం సాయం చేయాలని పలకరించాలని బుద్ధి పుడ్తుందట ఎవ్వరికైనా ! ఎంత లోకానుశీలనం—

ఆ మీదట జానపదులుల జాణతనాలు "పదుల్లో" లెక్కించి చెప్పారు కవిగారు మొట్టమొదట – ఆడవారి చేయి అందుకుని - స్వతంత్రించి - ఆ చేతులకు గాజులుతొడిగే - పల్లెసీమ వ్యాపారి గాజులసెట్టిపై సాగించారు.

పల్లె పల్లె తిరిగి మాల్లారములోసి
అడప దడప కదప గడప త్రొక్కి
చిల్లర తిరునాళ్ళ గుళ్ళ సంగళ్ళ నీ
పట్టని చేయి లేదు పడతులందు

ఈ పద్యానికి ప్రతి పదార్థం అక్కర్లేదు భావం వివరింప అక్కర్లేదు వృత్ర కామేష్టి గురించి ఎంత మధుర కల్పన చేశారో చూడండి. అధరమాధ మించి హస్తద్వయి ప్రశస్త పూర్ణ కుంభయుగ్మకమున్ వహించి శ్రోత్రియుడు పవిత్ర పుత్ర కామేష్టిలో కోరివేల్చు (359) పద్యం 79 పు) ఈ పద్యం కూర్పులోని సొగసుదనానికి - కవిగారి గడుసుదనానికి. "భళా" ! అనక తప్పదు ఇంకో పద్యం చూద్దాం

గురు తరాసహ చిరవిరహజ్వరార్తకు
నాడి చూచి పలుకు కోడె వజ్జు
మందువలవ దొక్క మారు లంఘనమె
పథ్యము హితపర 'మౌషధ'మ్మటంచు

ఇందులో కూర్చిన పదాల పొందిక - సరస సంభాషణా సరస్వతి అందియ.... 'అనుభవ రసికో విజానాతి' ఇవే కాదు ... పుష్పలావికల ప్రబంధ ప్రసంగాలకు సరి దీటైన పద్యాలు - పల్లెటూళ్ళలో మాట విరపుల మరుని లీలలు ఎన్నో ఎన్నో ఇందులో గుది గుచ్చారు.

తర్వాత నాల్గో తరంగంలో నాయికా నాయకుల 'సంగతులు' .... ఇద్దరు భార్యలమగడు అతగాడు. ఒకామెకు అందరూ ఆడపిల్లలే. ఇంకొక భార్యకు అంతా మగసంతే ! వాళ్ళిద్దర్నీ సమంగా సంభాషిస్తూ మనకు అల్లుళ్ళు కోడళ్లు వసారు. అంటాడట దక్షిణ నాయకుడు.

సంసారంలో సరిగమలు పలికిస్తూ 'అవ్వ మంచము పయి అమ్మ నన్నొదిలేసి నాన్న పక్కన పడుకొన్న దనుచు' పట్టుదలగా చేయు చిట్టి పిర్యాదుకు పదినెలు మరదం|డు పక్కుమం|డు అంటారు. ఇది ఇంటింటి భాగవతం పసితనపు రామలీలలు.... అమాయకపు' భారతం.

పది పండ్లల్లో ఒక పండు తీసి రుచి చూపించ గలుగుతారు. పది ముత్యాలలో ఒక ముత్యం తీసి దాని నాణెం |ప్రదర్శిస్తారు. కుండెడు అన్నాన్ని ఒక మెతుకు చూసి దించేస్తారు. ఏదైనా అంతే! అంతే లేని భావనా పటిమకు అడుగడుగునా అద్దం పట్టే కవిత్వాన్ని చిన్ని పరిచయంలో చూపించడం నాలాటి వారికి సాధ్యం కాదు వాచవి చూపించేస్తే రుచి మరిగి మొత్తాన్ని |గ్రహిస్తారని ఆశ.

ఈ ఐదొందల "ముక్తక |స్రవంతిలో" మునిగితే ఆనందంలోంచి తేలడం కష్టం. అయినా ఎవరి కృషి వారిది! నీటి కొలది తామర. ముగింపు శాస్త్రిగారి మాటలే అంటాను.

మచ్చు కొకటి నచ్చి మెచ్చు కొన్నను చాలు
నచ్చు కృతి రచించు కృషి ఫలించు
తలపు కొలదు లాటి వెలదు లన్నింటిలో
నేది యగునో ఎవని మోదవలనకు

పంచ శతాధిక 'ఆట వెలిదీ' సమూహం పదాలని కదలిస్తూ శృంగార తరంగ లహరిని సృష్టిస్తూ ఉంటే ఎవరికి దక్కిన ఆనందం వారికి దక్కుతుంది.

——०-

యామినీ సరస్వతి

# అగ్రగ - హారాల అందాలు

"వహ్వా ! వహ్వా ! ఏమి సారశేంబు ! ఏమిసారాశెంబు"

సుమారు అరవై డెబ్బై ఏళ్ళ క్రితం పండిత సమావేశాల్లో చాలా ఎక్కువగా వినిపించే ఈ మాటాల వెనుక ఓ పెద్ద కథవుంది. మరో గొప్ప నాటకం కూడా ఉంది ! ఎవరైనా పండితమ్మన్యుడు పరిచయా భిజ్ఞతను ప్రకటింప చూసినపుడు వరసైనవారో, అయినవారో, కానివారో హేళనగా అనే ఈ మాటలు ఆనాడు ఆంధ్రదేశంలో సామెతగా ఆమెతవాగా చెలామణి అయ్యాయి !

ఇవి ఒక సంస్కృత కావ్యంలోనివికావు రామాయణంలాటి ఐతిహాసిక కావ్యంలోనివికావు. కాళిదాస కమనీయ సృష్టి అనదగ్గ కావ్యాల్లోవి నాటకాల్లోవి కావు. పండితజన రంజకాలైన ప్రబంధాల్లోవి కావు.

ఒక తెలుగు నాటకంలోనివి!
ఒక తెలుగు నాటకకర్త హృదయంలోంచి పుట్టుకొచ్చినవి!
ఒక తెలుగు వాడి వేడి తెలిపేవి.
అవి ప్రతాపరుద్రీయ నాటకంలోనివి !

ఆ నాటక రచయిత కళాప్రపూర్ణ వేదం వేంకట రాయశాస్త్రి శాస్త్రి గారి వాదం వేదం! శాస్త్రిగారి పదం వేదం! శాస్త్రిగారి మాట వేదం ! అలా పేరు ప్రఖ్యాతి సంపాదించిన వ్యాఖ్యాత పండితోత్తముడు నాటక రచయిత నభూతో నభవిష్యతి

యుక్తికి యుగంధరుడు వైయుక్తికి యౌగంధ రాయణుడు. కుయుక్తికి చాణక్యుడు - ఈ మంత్రిత్రయం మూర్తి త్రయమే! ఆపదల్లో ఆర్తత్రాణ పరాయణుడిలా, సాక్షాత్ పరమేశ్వరుడిలా సృష్టిలో అపరబ్రహ్మల్లా వ్యవహరించిన

మంత్రులు మళ్ళీలేరు! రారు రాబోరు అలాంటి యుగంధర యుక్తిపై చిత్యమే ప్రతాపరుద్రీయము.

ఈ నాటక కథ చారిత్రాత్మక కల్పిత గాథ పాత్రలన్నీ సజీవాలు! చారిత్రకాలు! ఢిల్లీ సుల్తాన్, ఓరుగల్లు ప్రభువు, మంత్రి, పండితులు అందరూ ఆనాడే కాదు నేడూ జీవించివున్న సజీవ మూర్తులు. కుచ్చితాలకు ఆలవాలమైన అలంపనా - కుయుక్తులకు ఎత్తుకు పై ఎత్తులకు ఆలంబమైన మంత్రీ కావ్య లోకంలో ఆ చంద్ర తారార్కం నిలిచే ప్రతాపరుద్ర యశో భూషణ కర్తా – ఈ ముప్పేటల మధ్య ముడిపడిన కల్పనా నల్ప శిల్ప భూమి ప్రతాపరుద్రీయము.

వీళ్ళందరితో తులతూగే కల్పిత వ్యక్తి పేరిగాడు. ఆ సృష్టికర్త విచిత్రంగా కొన్ని పోలికలతో ప్రతాప రుద్ర చక్రవర్తిని పోలేలా పేరిగాడ్ని సృష్టిస్తే – ఆ పోలికలతో సాటి లేని మేటి నాటకం ఆడించిన ఘనత యుగంధర మంత్రిది.

ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్
మూడే నెల్లెకూ పట్టుక పోతాన్
నీరజ్ని రాగజ్ని మన్ను చేయిస్తాన్
గోతిలో పాతించి గోరి కట్టిస్తాన్

ఇవి వర్రి మొర్రి కేకలు! ఢిల్లీ పట్టణంలో రేయింబవళ్ళు మార్మోగిన వెర్రి వాడి కేకలు.

అలా ఎందుకు కేకేశాడయ్యా అంటే

వలీఖాన్ ఢిల్లీ సుల్తాన్ సర్వ సేనాపతి మైత్రి నటిస్తూ సర్వ సేనలతో విచ్చేసి రాయబారం నడుపుతున్నట్టే నటిస్తూ త్రిలింగరాజ్యాధినేత అయిన ఓరుగల్లు ప్రభువు ప్రతాపరుద్ర మహారాజు కోసం వచ్చాడు. రాజునగరంలో లేడు. మంత్రి యుగంధరుడూ లేడు. ఆయన తమ్ముడు జనార్ధన మంత్రి మాత్రమే ఉన్నారు.

రాజు వేటకు వెళ్ళాడని తెలుసుకున్న వలీఖాన్ ఇక్కడ సహాయం అర్థించే నాటకం ఆడ్తూనే అటు అడవికి వెళ్ళి రాజును బంధించి ఢిల్లీకి పట్టుక పోతాడు.

విద్యానాధుడనే కవి ఓడలో వెళ్తున్న రాజును చూస్తాడు. కూతురి పెళ్ళి కోసం రాజదర్శనానికి వెళ్ళి కృతి కన్యను దత్తం చేయాలనుకుంటున్న ఆ కవి రాజ ముద్రిక పొంది రాజకీయ నాటక రంగంలో పాత్ర అవుతాడు.

ఓరుగల్లు చేరిన మంత్రికి కథ యావత్తూ తెలుస్తుంది. రాజముద్రిక ఒక పాచికగా చేసుకొని - రాజుగారి పోలికలతోవున్న పేరిగాడ్ని రాజవేషం వేసి సభలో కూర్చో బెట్టి ఢిల్లి సుల్తాన్ పట్టుక పోయింది. రాజు పోలికలతో వున్న పేరిగాడిని అనే వదంతి పుట్టిస్తాడు. ఇదే నాటకానికి ఆయుప్పు పట్టు.

ఆపై యుగంధర్ ఢిల్లీ వెళ్తాడు. ఇక్కడ మంత్రులు పేరిగాడితో వినోద విద్యాగోష్టులు నిర్వహిస్తూ వుంటే అక్కడ ఢిల్లీలో పాదుషా కళ్లు గప్పుతూ నాటకం ఆడ్తూ వుంటాడు యుగంధర్.

అదిగో— ఆతొలి మాటలు ఓరుగల్లులోనివయితే మలిమాటలు ఢిల్లీలోనివి—

రాజకీయం నెరపి రాజ తంత్రం నడిపి ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోలాన్. ఇదుగో ఇప్పుడే పట్టుక పోతాన్ అని ఢిల్లీపాదుషాతోసహా ప్రతాపరుద్రుడ్ని ఓరుగంటికి తెచ్చి ఇద్దరి మధ్య స్నేహ ఒప్పందాలు ఏర్పరచి రాజ్యాన్ని సురక్షితం చేస్తాడు యుగంధరుడు!

ఇక నాటకంలోని పేరిగాని వాక్కులు హాస్యానికి పేరిమి కూరిమి మంత్రాలే! నాట్యకత్తెతో సంభాషణ, కవిగారితో మాటల భేటి భలేపసందుగా వుంటాయి "ఆటగత్తె" అనే మాటకు "ఆటకత్తేంటి ?" కత్తి ఆడుద్దా?" అని అడుగుతాడు.

ఆఖవుగా కవిగారు—

"సలవమదతఃకి మతెనే ఎలిబూడిద సౌడు సున్నమొల్లల మలెనే
కలునీలమలె మడేల యెలిగే నీయసమునేల కెలకో కవురా !
అనితనని పొగిడితే "అచ్చరనచ్చలు" ఇమ్మంటాడు
అన్నిముగిశాక కొలువుతీరిన రాజసభకు విద్యానాధుడు వస్తాడు.

"నవలక్ష ధనుర్ధరాధినాథే
పృథివీం శాసతి వీరరుద్ర దేవే
అభవత్ప రమగ్రహార పీడా—

అని అర్థోక్తితో ఆగుతాడు. రాజుకు ఆశ్చర్యం ! ఆగ్రహం ! తొమ్మిది లక్షలు విలుకాండ్రున్న రాజుతాను ఆ ప్రతాపరుద్రదేవుడు పాలిస్తూ వుంటే అగ్రహారాలకు బాధ కలిగిడంటే అది ఆశ్చర్యంకాదా ! ఆగ్రహకారణం కాదా ? దానికి ముక్తాయింపు— మరీ ఇంపుగా చెప్పాడు.

"కుచ కుంభేషు కురంగలోచనా"

దాంతో అంతా మురిపోయింది. అగ్రహరపీడనిజమే ! కానీ అవి అగ్రహారాలనే వూళ్ళుకాదు—

అగ్రహారాలు—కురంగలోచనలయిన స్త్రీల కుచ కుంభాలపై మెరిసే అగ్రహారాలు—

భళి భళ్ళ మహాకవి అని ప్రశంస పొందాడు కవి

ప్రతాపరుద్రీయం ఆద్యంతం చదవాలేకానీ మనమూ బళీ బళీ మహాకవి అంటాం ; అక్షర లక్షలు ఇవ్వగలిగిన కవిత్వ కల్పన చదువుతాం.

# మామా ! చలివెన్నెల్లో భామ

అమృతము కూడకట్టిన దార! ఎంత గొప్పసంబోధన! ఎంత గాఢ మైన భావం! ఎంత లోతైన అర్థం! పిలుపులోనే గొప్పదనమంతా మూట గట్టింది! వే వెలుంగుల సైదోడురే వెలుంగు! అంద చందాల మామ చంద మామ! ఆ చందమామకు మనసారా చెప్పుకొనే మనోవేదన.

ఏమిటా వేదన!

రమణి ఒకింత కోపన పరాఙ్ముఖి అయింది. అలిగి అటు తిరిగి పండుకొని ఒకే మంచంలో—మంచంమీద కాదు కంగులు తీరు ధోవతి గాలికి—కాలికి తాఁకనీకుండా మంచంపట్టె ఆనుకొని పార్శ్వం అంతా కుదించుకొని వియోగంతో నిటూర్పులు కూడా వినిపించకుండా కుదించి పట్టుకునే—సొక్కే-ప్రియురాలు-భార్యకు-భర్తకు మధ్య రాయబారం నడిపేందుకు నింగి నేలల మబ్బుల మధ్య-గాలికి కదులుతూ కాలాన్ని కదిలించే శశిదూతపు కమ్మని ప్రియుడైన భర్త వేడుకునే విన్నపం శశిదూతం

అలిగిన భార్యను ప్రసన్నం చేసుకోవాలని ఎన్నివిధాల ప్రయత్నించినా ఎన్నెన్ని మాటలు చెప్పుకొన్నా వినకపోతే ఇక లాభంలేదని అటుతిరిగి పడుకున్న ఆమె జబ్బ పట్టుకొని ఇటుతిప్పి లేత చెక్కిలిమీద పెనముద్దు పెట్టి గిలిగింతలు పెట్టే వెక్కి-వెక్కి ఏడ్చే ముద్దరాలికీ తనకీ సంధిచేయమని నిశాపతిని వేడుకొనే రమణీయ కమనీయ భావనా లహరి శశిదూతం.

నిజానికి రాయబారులు పూర్వం ఎవరెవరు? ఒక నిషధేశ్వరేంద్రుడికి ఒక మరాళమతల్లి-హంస-మరి ఒక రఘువంశ దేవుడికి-రాముడికి-ఒక ప్లవంగమ వీరుడు-హనుమ. మరి ఒక శాపగ్రస్తుడైన యక్షుడికి ఒక పయోధర సాధువు మేఘుడు-వీళ్ళ వల్ల వాళ్ళకు సుఖములు కలిగాయి-కాబట్టి నీవల్ల నేను సుఖమందగ కోరుకుంటున్నాను.

అయితే వాళ్ళు భారం వహించిన ఆ రాయబారాల్లో ఎంతో కష్టం ఉంది. ఎంతో క్లిష్టత ఉంది! ఎలాఅంటే దమయంతికి నలుడుమీద ప్రేమ

బీజాలు నాటడం అంత సులువుకాదు. కష్టం. అలాగే ఎక్కడ సీత ఉందో వెతుక్కుంటూ పోవడం హనుమకు సులభం కాదు! క్లిష్టం. ఏ కొండమీద ఉందో-ఏ పర్వత సానువుల నీడల్లా ఉందో, యక్షుడి సతి-అమెకై కొండ కొండని కొండ గుర్తుగా చేసుకొని వెళ్ళడం అంత తేలిక్కాదు-మరి ఇక్కడ? ఈ రాయబారంలో ఆ కష్టం క్లిష్టత ఏవీలేవు. ఎందుకంటే ఇక్కడ రాయబారం తీసికెళ్ళేది కుల పత్ని-సుందరికి అదీ సంగతి!

లోకంలో ఎందరో ఎన్నో ఉండగా ఈ చంద్రుడ్నే రాయబారిగా ఎన్ను కోవడానికి కారణం ఏమిటి. ముగుదలు, పూలు, చందురుడు ఒక మోస్తరు కోమల జీవులట అంతేకాక వీళ్ళంతా పూలకుటుంబం వాళ్ళట! ఒకరంటే ఒకరికి పూలంటే స్త్రీలకు-స్త్రీలంటే పూలకు, చంద్రుడికి ఎంతో స్నేహమట మీరు మీరూ ఒకటే కాబట్టి ఈ రాయబారం చేసిపెట్టు అని అడుగుతున్నాడు. చంద్రోదయం ఎంత మనోహరంగా ఉంటుందట! కుంకుమాంకితమై వలిపంపు రైకనుండి బయట పడిన తూర్పు కన్నెరొమ్ములాగా తూర్పుకొండకొన కొమ్మున ఉదయిస్తాడట చంద్రుడు!

మరి ఆ చంద్రుడికి ఓమచ్చ ఉంది. నిజానికి క్షీరసాగర మథన సమయంలో గిరి కవ్వము దూసుకుపోగా ఏర్పడ్డ మచ్చట! లోకమంతా మచ్చ లేని చందమామకి మచ్చ కల్పించారట. నిజానికి విష్ణువు రొమ్మునఉన్న మచ్చ అరవిందం అంటారు. భోగలక్షణంగా చెప్పుకుంటారు. అలాగే చంద్రుడ్నీ పొగడొచ్చుగా! ఉహూ! అది కళంకమట! ఎందుకయిందట? ఇచ్చకాలు చెప్పే పద్ధతి అలాగే వుంటుందట మరి!

ఓ కలువరాయా! నువ్వుమాకు ప్రసన్నం కావయ్యా ! నీవెన్నెల ఎలాటిది ? వెన్నెల అనే దారాలతో వెండిపటం అల్లుతావు. దానిమధ్య గూడు కట్టుకుంటావు. సాలీడు గూడు అల్లినట్లుగా అల్లి కూర్చిన నీ పెనుదారాల చిక్కుల్లో-నీ పున్నమ దీప్తిలో—చీకటి అనే పురువులను పట్టి పలారుస్తూ లోకమంతా వెన్నెల నింపుతావు. అదిగో ఆ వెన్నెల చలువలై మరి మాకు ప్రసన్నం కావాలి ప్రభూ!

ఓ చంద్రా నీకు ధన్యవాదాలయ్యా బాబూ! ఈ లోకంలో ఒక మనిషి ఇంకొకమానవుడిని అడగడం చచ్చిన చావుకదా! ఒక వేళ నోరు తెరిచి అడిగినా కూడా ఒకడు ముఖం తిప్పుకొని వెళతాడు. మరొకడు ముఖం మటమట

లాడిస్తాడు. కొందరు చిరాకు వస్తారు. ఎవడో ఒకడు నోట లేదనేకి చేతుల్తో లేదంటాడు. కానీ నీవు చేసే ఈ ఉపకారం శిబిదధీచి మొదలయిన దాతల్ని తలపిస్తోంది.

ఏం చేశానంటావా ?

నా చెలి — గుండెల్లో పొంగే కోరికతో తానై చేరింది నా కంఠం చుట్టూ తన మృదు హస్తాలను మాలగా వేసి పరవశత్వం పొందింది. అంతేనా నా గుండెల మీద వాలి పోయింది. అంతేనా నన్ను క్షమించమని నా గడ్డం పట్టుకొని బతిమాలుతోంది. ఇదంతా నీ దయ కాదా !

అయినా నిను కుంటెన కాడిని చేశానని బాధ పడకు
వేడుకుంటే కోరిక తీర్చే దాతలు ఎవరున్నారు ?
మరి నీవో ?
ఉత్తముల్లో ఉత్తముడివి.
ఎలా అంటావా ?

ఇత్తునటించు తా అధము డీయడు. రేపులు తిప్పి తిప్పి - తాయిత్తు అటంచు మధ్యముడు ఇచ్చును. తప్పక రేపోమాపో - తాయిత్తు అటంచు నోట అనడు — ఇచ్చును వందలు వేలు లక్షలై ఉత్తముడు. అట్టి ఉత్తముల ఉత్తము డౌదువు నీవు చంద్రమా !

చందమామా ఈ దయచాలుఉహూ ఎవ్వరయినా ఎప్పుడైనా ఎన్నడైనా భార్యా విరహంతో బాధ పడ్తుంటే వాళ్ళని ఆదుకో - చలి వెన్నెల సోన జల్లుతో ఆదుకొని వాళ్ళిద్దర్నీ ఒకటి చేయ్ !

వెన్నెలకన్నా చల్లగా వెన్నకన్నా మృదువుగా ద్రాక్షా పాకంలో సాగిన కమనీయ రచన విశ్వనాథ సత్యనారాయణగారి శశిదూతము. గుండెలనిండా ప్రేమ ఉన్న ప్రతి భావకుడు చదివి తీరాల్సిన రమణీయ రచన శశిదూతము.

# అల్లంత దూరాన దీపాల కళ్ళ మనిషి

పర్ణశాలకు అల్లంత దూరంలో లేమావి తోటలో ఎలమావి గున్నకు నీళ్ళుపోస్తూ చూస్తోంది తార! పదారు వన్నెల బంగారు ఛాయతో మిస మిస లాడ్తున్నాడు ఆ కుర్రాడు. బృహస్పతిముందు చేతులొగ్గి ఏదో చెప్తున్నాడు. కాని తార మనసంతా ఆ కుర్రాడి సోయగం మీదే ఉంది.

"నా అంత వాడిని చేస్తా చంద్రా!" అంటున్న భర్తమాటలు విందామె ఒహో! తారా మనోహరుడా! అనుకుంది. చక్కని చోటికి వచ్చి చిక్కాల్సిన చోట చేతికే చిక్కుతున్నావులే! గురువుగారు అష్టాదశ విద్యలు నేర్పుతాడు.... నేను...." అనుకుంది తార. చంద్రుడు విద్యాభ్యాసం ప్రారంభించాడు. ఏళు గడిచాయి. మొక్కను ప్రేమతో పెంచి ఫలం ఆశించే విధంగా చంద్రుడ్ని పెంచింది తార.

యౌవనం వచ్చింది ఎండిపోయిన చెట్టుపై వసంతుడు దాడి చేస్తే నిలువెల్లా పూచినట్లు యౌవనావిర్భావంతో నిలువెల్ల అందమే నిండిపోయింది. తార గుండెలనిండా కోరికలు నిండాయి. అతన్ని చూస్తే కులుకుచూపుల చూడని మీనాక్షి లేదు. అతని పెదవులుచూసి అనురక్తిచెందని బింబాధరా కానరాదు. అతను భాషిస్తే పలుకరించని చిలుకలకొలికి లేదు. అతని ముఖం చూసి తమి చెంది, కందని కమలముఖి లేదు. నిలువెల్లా చూసి అతన్నల్లుకుపోవాలని ఆశపడని లతాంగి ఉండదు. ఏ ప్రమద చూసినా పారవశ్యం చెందాల్సిందే! ఏ హేమాంగి చూసినా మరుని కాకకులోను కావాలి! అబలలు చెంతచేరి దయ చూడమంటున్నారు! గజ గమనలు కేలెత్తి మొక్కుతున్నారు. అతని రూప యౌవన విలాస విభ్రమాలు చూసి తత్తర చెందని తరుణులే లేరంటే అది స

బయటవాళ్ళకే అలా ఉంటే-

ఇంట్లో ప్రతిక్షణం తిరుగాడ్తూ తన నగ్న వక్షాన్ని విశాల బాహువుల్ని ప్రత్యక్ష పరుస్తోన్న చంద్రుడ్ని చూసిన తార-తాళలేకపోయింది. ఎలాగైనా ఇతడ్ని లొంగదీసుకోవాలి అనుకొంది. న్యాయం కాదేమో అనుకొని న్యాయాన్యాయాలు విచారిస్తే నిలువగలనా అని సరిపెట్టుకుంది.

మెల మెల్లగా అతని సమీపంలో తిరుగాడసాగింది. బృహస్పతి లేని సమయంతో చెంతచేరి రెప్పవేయకుండా చూస్తోంది. అతని దగ్గరగావెళ్ళి ఓర పయట జారేట్లుచేసి చెంతచేరి భుజానికి తన మనోభూరుహాల్ని సోకిస్తోంది.

అల్లప్పుడు-పాపడా! చిన్ని కుమారా! రారా! బాబూ! అనిపిలిచేది. ఇప్పుడో ఓ సామి! ఓకాయజ మోహనాకార! వగకాడ! జాణా! అని నర్మోక్తులతో పిలుస్తోంది.

అమాయకం నటిస్తున్న చంద్రుడ్ని ఏకాంతానికి పిల్చి జిలుగుచీర పిడిచి చెంగావిచీర కట్టుకుని ఏ చీరలో బావున్నాను అని అడుగుతోంది. జడ వదిలి కొప్పుకట్టి ఎలావుంది అని అడుగుతోంది. అతన్ని దగ్గరికి పిలిచి ఒళ్ళు రాచుకునేలా నిలబడి నువ్వెత్తా నేనెత్తా అని ప్రశ్నిస్తుంది. ఎవరయినా చూస్తున్నారేమో అనే సిగ్గు కూడా ఉండదు.

చంద్రా! చంద్రా! ఇలారా! అద్దం లేదు! ఈ తిలకం ముఖాన దిద్దిపో అని పిలుస్తుంది. బుద్ధిగా వచ్చి తిలకం అతడు దిద్దితే పెదాలు కుదురు చేసి ముద్దిడుకో అన్నట్లు సమీపిస్తుంది. అతడు అమాయకుడిలా మౌనం వహిస్తే రుసరుసలాడుతుంది.

ఇక ఇదికాదని యిలారా! నీ తలకట్టు చిక్కుతీసి నున్నగా దువ్వుతా అని అతన్ని రప్పించుకుని తాను పీటమీద కూర్చుని అతని తలను తన గుండెలకుహత్తుకుంటూ చిక్కుతీస్తుంది! మాటామాటా కలిపి తటాలున బుగ్గగిల్లుతుంది. అయినా అతడు రమ్మనడంలేదు కిమ్మనడం లేదు.

ఓరోజు ఆదమరచి నిద్రిస్తుంటే తమకం ఆపుకోలేక ఆ లేతబుగ్గలు ముద్దుపెట్టుకుంది. చంద్రుడుకు నిద్ర లేచి లేవగానే అద్దంలో ఆముద్దు గుర్తులు

చూపించి ఎక్కడికి వెళ్లొచ్చావు? ఎవరిలా ముద్దాడారు? చెప్పు? గట్టిగా చదువు కొమ్మని మీ వాళ్ళు పంపితే ఇలా రాయిడిలా రట్టు చేస్తున్నావా అని నిలదీసింది. పాపం నోరెత్తలేదు చంద్రుడు!

అలా అలా తార మితిమీరి రెచ్చగొడితే చంద్రుడిలో తొందర మొదలైంది. ఆలోచన అనంత శాస్త్రాలు వదిలి అనంగశాస్త్రం చుట్టూ తిరగసాగింది. ఆమె మోమును మోవిని హొయలను చూపును మెచ్చుకోసాగాడు లోకంలో ఎందరిని చూడలేదు! చందమామ ముఖంతో ఎందరున్నా ఈ అందచందాలు ఎవరికున్నాయి! నాలోనేమో కోరికలు ఎక్కుటమై పోతున్నాయి! ఇదేమో అందరాని ఫలమైంది! ఏం చెప్పవలె! అని మన్మథ వేదనకు లోనవుతున్నాడు. ఏవేదాలు ఏ శాస్త్రాలు ఏవాదాలు ఏవివేకం ఎలా నిలుస్తుంది అనుకుంటున్నాడు. శాస్త్రాలు శాస్త్రాలు అంటారేకానీ పొలయలుకలు ఈ పొలతుకతో తర్కించడం తర్కశాస్త్రం కాదా? అనంగ రంగకేళిలో ఈవిడతో కలిసి కళాస్వరాలు పలకడం స్వరశాస్త్రం కాదా! ఈమె మోమున మోము చేర్చడం యోగశాస్త్రం కాదా! ఈమె రతిక్రీడా గుణాలను లెక్కించడం సాంఖ్యశాస్త్రం కాదనగలరా! ఆవిడ నీవి వదిలించడం మోక్షశాస్త్రం అనలేమా! అంతేనా ద్వైతం అద్వైతం మా కలయికలో తేట తెల్లం కాదా! అని వింతవాదన చేస్తున్నాడు అంతరంలో

ఆమె చెక్కిలిమీద నొక్కులుంచడం గురుప్రతిష్ట సలపడంలా భావిస్తున్నాడు.

ఎన్ని విధాలా ఆలోచించినా కోరికతీరే తరుణం రావడంలేదు. తార రకరకాలుగా రెచ్చగొడుతోందేతప్ప దరిచేరి చేర్చుకొని విరహం దరిచేరేలా చేయడం లేదు. నిద్రించే కోరికలు రెచ్చగొట్టి వొళ్ళు సల సల కాగేలా చేస్తుంది తప్ప సరస శృంగార సీమకు స్వాగతం పలకడం లేదు.

ఎలా? ఎలా? ఎలా?

చంద్రుని కోరికలు పండేతరుణం వచ్చిందా అన్నట్లు బృహస్పతికి పిలుపువచ్చింది. యజ్ఞం చేయించడానికి అమరావతికి వెడుతూ రకరకాల నీతి బోధ చేసి చంద్రుని ప్రేమగా చూసుకొమ్మని చెప్పివెళ్లాడు.

ఇంక తార కోరికల తెర తొలగింది ఆపై........

# వయస్సుకు కాపలా !

ఓ మహానుభావా ! నేను మహేంద్రుడి దూతను ఆయన యజ్ఞం చేయ సంకల్పించాడు. మిమ్మల్ని గౌరవ పురస్కారంగా తోడ్కొని రమ్మని నను పంపినాడు అని దూత బృహస్పతి వద్దకు వచ్చి చెప్పగానే బృహస్పతికి మొగ మింతై అలాగా ! సురేంద్రుడు జన్నము సేయాలని నన్ను రమ్మన్నాడా ! అలాగే కానీలే వస్తానని పాకలోనికి వెళ్లారు

అక్కడ—

అలిగిన సత్యభామలా, కలగిన రతీదేవిలా వుంది తార. ఆమె భర్త సురలోకం వెళ్లడం మనస్సులో సంతోషం కలించినా పైపైకి మాత్రం ఎంతో బాధ ప్రకటిస్తోంది. భర్తను చూడగానే మూతి సున్నాలా చేసింది. ముఖం ముడిచిలది.

ఆయినా - బృహస్పతి ఆదేం గమనించనట్టు ఓ గజేంద్ర గామినీ ! ఇంద్రుడు యాగం చేయాలి ఆలిని విడిచిరావయ్యా అనికబురు పంపాడు నువ్వ నావియోగం ఎలా సహిస్తావో ! ముడు లోకాల యేలిక రారమ్మని కబురు చేస్తే ఎలా తిరస్కరించడం ! పైగా రమ్మన్నది యాగం చేయించడానికి ! క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగి రమ్మని పంపించు ! నువ్వు మనస్సులో బాధ తొలిగించుకో - ఇల్లూ వాకిలీ భద్రంగా చూసుకో ! ఓ మదమత్తేభేంద్ర కుంభ స్తనీ ! నేను వూరు విడిచి వెళ్ళినపుడు నువ్వు చరించాల్సిన, ఆచరించాల్సిన విధానాలు కొన్ని ఉన్నాయి ! చెబుతా విను !

నువ్వు నున్నగా తలకట్టు దువ్వి జడలు వేసుకోరాదు. అలా వొంటి జడ వేసుకోవాలి ! రకరకలాయిన సరసాన్నాలు తినకూడదుసుమా ! ఉప్పు కారం తింటే ముప్పు కదా ! గంధం పూసుకోరాదు ముఖాన తిలకం తీర్చిదిద్దు కోరాదు రకరకాల ఆభరణాలు ధరించకూడదు. అన్నట్టు తల నిండ పూదండ

తురుముకోకూడదు.... అవన్నీ నీకే విధించడం లేదు భర్త వూళ్లో లేనపుడు ఏ సాధ్వి అయినా ఇలాగే ఉండాలి.

నువ్వు నన్నే తలచుకోవాలి ! చెప్పకున్నా చెప్పినా నీ మనస్సులో నేనే వుంటాలే !

అదిగో ఏంటా కోపం !

అన్నట్టు ఇంకో మాట ! మా ప్రియ శిష్యుడు చంద్రుడున్నడే ! వాడు అన్నిటా బుద్ధిమంతుడు ! నీ మనస్సు తెలుసుకుని తగినట్లుయింట్లో మెలుగుతాడు. నువ్వు ఏ అరమరిక లేకుండా కావాలసిన పనులు చెప్పి చేయించుకో !

వాడు వయస్సులో బాలుడే ! అయితేనేం పరిపక్వమైన తెలివితో చాలా పెద్దవాడు ! గృహకృత్యాల్లో నన్ను మరిపిస్తాడు ! అయితే ఎండ కన్నె రుగని సుకుమారుడు సుమాచంద్రుడు !

వాడు ఇంటిని కని పెట్టుకుని వుంటాడు అడగలేని ఆ అర్భకుడికి వేళ చూసి వడ్డించు! అతన్ని ఎంతయినా ప్రేమగా చూడాలి సుమా అన్నాడు.

తార కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

నిజంగా ! నిజంగా పయనమా ! నవ్వేలాటకు అంటున్నారా నాధా! నామీద కోపమా ! నన్ను వొంటరిగా విడిచి పెడతారా ! తారానాధులు తమరికి ఏ రీతిగా మనసొప్పింది, మిమ్మ్ము పిడిచి ఎలా వుండటం ?

ఎందుకండి వెళ్ళడం అందామా యజ్ఞ భంగం చేసిన దోషం! కన్నీరు నింపితే అమంగళం ! వెళ్ళిరండి అనడానికి నోరు రావడం లేదు. నన్నూ మీతో తీసుకుని వెళ్ళండి అంటే అదెంత భారమో !

అయినా ! మిమ్మల్ని అనేం లెండి !

కొన్నాళ్ళు తీర్థాలి వెంబడి తిరిగారు. కొన్నాళ్ళు యజ్ఞ దీక్ష అన్నారు. కొన్నాళ్ళు వొక్క పొద్దులు ! మరి కొన్నాళ్ళు తపస్సు, కొన్నాళ్ళు పాఠ ప్రవచనాల జోరు - అది తగ్గితే నేడమవాస - నేడు పున్నమి - కొన్నాళ్ళు ఇవి ఋతు దినాలు అని మరి కొన్ని రోజులు - కొన్నాళ్ళు అలసట -

ఇలా నా యెల ప్రాయమంతా పోయింది ! ఏ నాడూ ఒక్క మధుర మైన కౌగిలి కానీ ఒక్క తియ్యని మాట, ముద్దు కానీ ఎరగను. చివరకు యిప్పుడు ప్రయాణ వియోగం.

అయినా యజ్ఞం యజ్ఞమంటారు కదా! జఘనమనే వేదిక వుంది. జగి సిబ్బెపు గుబ్బల కలశాలున్నాయి. అధర సుధారస సోమరస ముంది ! తాగియ్యొచ్చు ! గళరవ మంత్రాలతో చెలరేగే ఆ మన్మథ క్రతువు కంటే వేరే పున్నెముందా. జన్నముందా ప్రభూ !

దేవా నాకు మాటలు రావు ! మీరు నిర్దయగా నన్నొంటరిని చేసి వెళతానంటే నేను తాళలేను - ఎలాగైనా పయనమై మీతో వస్తా -

అని బుడి బుడి ఏడ్పులు ఏడ్చింది -

లోపలేమో పోరా పో ముసలోడా - నువ్వు చెప్పినట్టే నీ కంటే బాగా గృహ కృత్యాలు నెరవేర్చే నా అందాల చందమామ వున్నాడు. మామక కోరికలు తీరుస్తాడు లే అని ఉబలాటం - పైనేమో వెప్పులు - ఏడ్పులు.

అది చూసి కన్నీరు తుడిచి - భలే ! అలా మాటాడితే ఎలా ? ఇక్కడివన్నీ ఎవరు చూస్తారు ! అయినా స్వర్గం అంటే - నట విట వార వధూటీ సమేతం. అక్కడికి అయి నింటి ఆడ పడుచులు ఎవరూ రారు !

వద్దు నా మాటకు అడ్డు చెప్పవద్దు....

'అలాగే లెండి, పోయిరండి! మీ మాటలకు ఎదురు చెప్పగల దాననా! ఇక్కడి దిగులు పెట్టుకోకుండా అక్కడ యాగం అవుతూనే నిమిషం కూడా ఆగక రండి !

మీ అత్రి కుమారుని ఆత్మకు మారునిలా చూసుకుంటాను. ప్రాణ ప్రదంగా గౌరవిస్తా ! మీకు ప్రియుడైతే నాకూ ప్రియుడు కాడా !

ఇక్కడి సంగతులు మరిచి వెళ్ళిరండి ! అంటూ మగడ్ని అటు రథ మెక్కించి ఇటు.... పెచ్చు రేగింది.... ఎలా ?

# సోయగాల స్నానం

విరహాగ్ని నీ రీతి కరిగె నామానసంబనినట్లు వెన్నగాచిన ఘృతంబు పాల బోల్వయసు నీ పాలు సేయుటకిదె యాన వాలన్నట్టు లానవాలు. నెమ్మి నీరీతి నాకెమ్మోవి గ్రోలు మీపూని నీ వన్నట్టు పానకంబు తనవచో మాధుర్య మెనయునా ఇవి చూడు మన్నట్టు షేలి రసాయనములు నొప్పుగా గిన్నియల నుంచి యుప చరించి పాణి పంకజ కంకణక్వాణ మెసగ బువ్వసురటిని విసరుచు భోజనంబు కాంత సేయించెదన మనః కాంతునకు

బృహస్పతి స్వర్గానికి ఇంద్రుడు పిలపనంపితే వెళ్ళాడు. వెళుతూ తన భార్య తారకు అప్పగింతలు పెట్టాడు. ఎలా ఉండాలో నియమాలు షరతులు విధించాడు. తన ప్రియ శిష్యుడైన చంద్రుడ్ని జాగ్రత్తగా చూడమన్నాడు. అత్రి అనసూయల వర కుమారుడు సుకుమారుడు చంద్రుడు. అతని అందం చందం ఆ సరికే తార మనస్సు హరించింది. ఇంట్లో ఎవరైనా 'తారా మనోహర' అని పిలిస్తే ఎంతో ఆనందిస్తుంది. కనురెప్ప వేయకుండా చూస్తుంది. చూచి తలపూచి మెచ్చుకుంటుంది. మెచ్చి పక్కున నవ్వుతుంది. నవ్వి గిరుక్కున తొలిగి, అంతలో తళుక్కుమనేలా చూస్తుంది. చూచి దగ్గరికి రారమ్మని పిలుస్తుంది. పిలిచి ముచ్చట్లాడుతుంది, ఏకాంతం అంటూ దగ్గరికి వస్తుంది. చెవిలో గుసగుసలు చెప్పినట్టు ముఖాన ముఖం చేరుస్తుంది. చెక్కిలి చెక్కిలి సోకి సొమ్మసిల్లి పోతోంది. ఆ స్థితిలో వెళ్ళాడు భర్త.... వెళుతూ అప్పగింతలు పెడ్తే 'ఆత్మ కుమారునిలా' (కన్న కొడుకులా అని పైకి - ఆత్మకు మారునిలా - మన్మథునిలా అని లో లోపల భావించి) చూసుకుంటా నంటుంది. నీకు ప్రియమైన వానిని నేనూ ప్రియునిగా చూడవలదా అంటుంది - భర్త వెళ్ళాక చంద్రుడి సపర్యలు చేస్తుంది. అదిగో - అది ఈ సందర్భం.

తార ఇలా ఉంటే చంద్రుడు అంతకు ముందే విరహంలో మాడి పోతున్నాడు. మన్మథాగ్నిచే దహించబడిన మానసాన్ని బ్రతికించే సంజీవినీ విద్య దీని మాటలు - అనుకుంటున్నాడు.

ఏ వేదము ఏ శాస్త్రము ఏ వాదము యే వివేకము అనుకున్నాడు. ఈమెతో వాదిస్తే అదే తర్కశాస్త్రం ముఖానికి ముఖం చేర్చడమే యోగశాస్త్రం. పోకముడి విడవడమే మోక్షశాస్త్రం - ఇరువురు ఒకటి కావడమే అద్వైతం - మిగతా శాస్త్రాలు శాస్త్రాలుకారు. ర్థం అనుకుంటున్నాడు. జీవితమే వ్యర్థం అనుకునే స్థాయికి చేరాడు అదిగో అప్పుడు గురువుగారు ఇంద్రుడి వద్దకూ వెళ్తూ ఇతన్నప్పగించింది. 'సరసముగ గురు ప్రతిష్ట' చేయాలనుకుంటున్న చంద్రుడికి చక్కని అవకాశం దొరికింది.

మనసంతా చంద్రుడి మీద మాటలేమో మగనితో పయనమవుతున్నాడు బృహస్పతి. పైగా అలంకలుదువ్వరాదు—సరసాన్నాలు భుజింపరాదు, శరీరానికి గంధం పూయరాదు – పూలు పెట్టుకోరాదు, తిలకం దిద్దరాదు - అంటూ "నాథుడు" వూళ్లోలేనివేళ "సాధ్వి" యేయే అలంకారాలు చేసుకోరాదో బోధిస్తాడు సురసుర మంటుంది. తారకు - నెనెక్కువా - ఆయజ్ఞాలు ఎక్కువా ? ఎప్పుడూ వ్రతాలు, తీర్థాలు, యజ్ఞాలు అలటూ పొద్దుపుచ్చారు. నాయవ్వనమంతా ఇలా కరిగిపోయింది అయినా "మన్మధకృతువుకన్నా వేరొక జన్మముందా ?" అంటూ ఆయజ్ఞాన్ని గూర్చి వివరిస్తుండగా భార్యకు బుద్ధులు చెప్పి వెళ్ళిపోతాడు బృహస్పతి మనసులోని మర్మం బయల్పడనీయదు తార తనమనసంతా అతని మీదే ఉన్నట్టుగ నటించి వీడ్కోలు చెబుతుంది. అటు భర్త వెళ్ళి వెళ్ళగానే -

చంద్రుడికి తానే తలంటి తలారాస్నానం చేయించి అన్నీ సింగారించి భోజనం పెడ్తుంది. తన సోయగాలు ప్రకటిస్తుంది. అన్నీ గమనించిన చంద్రుడికి మతి పోయింది. అయినా నిగ్రహించు కుంటాడు. భయమూ భక్తి పెంచుకుంటాడు. ఇక తప్పదని తారే తెగిస్తుంది. చంద్రుడి బింకం జంకు చూసి "చంద్రా ! నీ అందం చూసి మోహ పడినా" నంటుంది. దోసిలొగ్గు తుంది. చంద్రుడు హితోపదేశం చేస్తాడు. మగడే దేవుడు - అంటాడు.

తార నిలదీసి ప్రశ్నిస్తుంది —

మగని నతిక్రమించుటలు మానిని కిం దగదంటి వొప్పితిన్ మగడు మగండనంగ మది మక్కువ యెవ్వని యందొ కంటికింపగునత డెవ్వడో యతడె యాతని గాదని యన్యు గూడినన్ తగదిది కాముకీ జనుల ధర్మము మర్మము నే నెరుంగుదున్ - అని కాముకీ జనుల ధర్మం బోధిస్తుంది - మీ తాత కన్న కూతు రయినా సరస్వతిని చేసుకున్నాడు. నీ బావ తన మేనత్త రాధతో రాసకేళి తేలాడు. మీ గురువు వదిన అనే వరుస పాటించ లేదు. నీ సహపాఠి ఇంద్రుడు అహల్యా జారుడు - మీ వాళ్ళంత ఇలాంటి వాళ్ళే మరచి పోయావా - అయినా ఎవరో అబలు ల్లాగా మాట్లాడ్తా వేంటోయ్ - పురాణాలు ధర్మాలు శాస్త్రాలు ఎవరికి ? చేతకాని వారికి - ఇది విను.

> లోకములోన కొంద రబలుల్ సతులం తనియింప లేకయ
> స్తోక మనీష నన్య పురుషుల్ తమ కాంతలనంట కుండ తా
> టాకుల లోన వ్రాసిరి పరాంగన గూడిన పాపమంచు అ
> య్యాకుల పాటు చూచి యిపుడాకుల పాటె నయంగ నేటికిన్ -

అంతే కాదు చంద్రా ! నాకు కులం వద్దు. శీలంవద్దు. ఆ మగడూ వద్దు. ఆ కాపురమూ వద్దు - చుట్టాలు పక్కాలు వద్దు - నామనో వల్లభా ! నీవు కావాలి ! నీతో కాపురం కావాలి !

అలా అడిగిన తారకు చంద్రుడు దాసాను దాసుడయ్యాడు.

ఆ తర్వాత ? ఏమైంది ? ?

# నేయి పోసి నీళ్ళోదిలిన లలన !

అలా బృహస్పతి అమరావతికి పోగానే ఇలా ఇంట్లో రకరకాల వంట కాల తయారు చేయించి అంతలో వచ్చిన చంద్రుడ్ని బంగరు పీట మీద కూర్చోబెట్టి తలంటుతూ మీ గురువుగారు నిజంగా వెళ్ళారా ? దూరం సాగారా ! లేక మధ్యలోనే తిరిగొస్తాడా ? మనకు దైవవశాత్తు ఏకాంతం దొరికింది ? ఇక నీ ఇష్టం అని తలంటుపూర్తి చేసి స్నానం చేయించి ఇంపైన భోజనం చేయించి తానూ గొజ్జంగి నీటి స్నానమాడి వలపచెంగాని పావడ కట్టుకుని, ఆపై బంగారంచు బవంతి చీరసింగారించి పైఠాణి రవిక తొడిగి ముఖాన జవ్వాజి బొట్టుపెట్టి కస్తురి అద్దుకుని చంద్రుడు విడిసిన తోటలోకి వచ్చింది.

ఆమెను చూసిన చంద్రుడికి కొమ్మకాదిది బంగారు బొమ్మగాని, ఇంతి కాదిది జాజి పూబంతిగాని, కలికికాదిది మరుని పూములికి కాని, భామ కాదిది లావణ్య సీమ కానిఅన్పించింది.

ఆమీదట ఆమె అంగాంగాన్నితనివి తీరాచూస్తూ తన శాస్త్ర పాండిత్యం అంతా వెల్లడి అయ్యేలా వర్ణిస్తాడు. ఆకృతిని హేమ రూపియో - ముక్కు తీరు చూడ తిలోత్తమ - మోముచూసిన శశిరేఖ - మాటతీరు మంజఘోష అని అప్సర శ్శిరోమణులతో పోలుస్తాడు.

అలా ఆమె సౌందర్యానికి లోనయి—

చూడకుండంగ కూడదీ సుదతి సొబగు, చూసినంతనె మదిలోన చొచ్చె బాళియేమిటికి వచ్చెనిచటకి ఇందు వదన ఎట్టులున్నదో ఇంక రతీశ్వరాజ్ఞ ఈశ్వరాజ్ఞ కాదిది రతి ఈశ్వరుడైన మన్మధుడి ఆజ్ఞ ఎట్లుందో అనుకుంటారు.

మన్మధుడి ఆజ్ఞ ఏమంటుంది ? ఏముంటుంది ? ఏకాంతంతో ఏ స్త్రీ పురుషులు కుర్చున్నా తనువు పులకింప చేయడం, చిత్తం తత్తరింపచేయడం, వివశతను పొందించడం ఆమీదట విరహం లేదా సంయోగం ఇదేకాదా మన్మధాజ్ఞ.

భయం భయంగా తారను చూస్తూ ఎందుకొచ్చావు. ఇంట్లో పనుల్లేవా? మనల్ని లా చూస్తే ఏమనుకుంటారు అని మందలించినట్లుగా అంటే ఆమె పని పడే వచ్చాను. ఇంట్లో పనేముంది? ఎవరైనా చూస్తారనా? చూడనీ. ఏమైనా అనుకుంటారా? అనుకోనీ? ఎవరేం గొప్ప? మన్మధ బారికి లోను కాని వాళ్ళెవరు? ఐనా నిజం చెబుతా విను.

నీనెర సీటు, నీ సొగసు, నీ రసికత్వం, నీ విలాసం. నీ నవ మోహనా కారం. నీయెల ప్రాయం చూచి చూచి ప్రేమించి అభిమానంతో దాచి ఇన్నాళ్ళూ మన్మధ వేధకు గురయ్యాను. నీ కోసమే నీ పొందు కోసమే వచ్చాను. నన్ను కరుణించి కటాక్షించి కౌగిలించి సుఖాల లాలించు అంది.

ఆ మాట వినగానే చంద్రుడి గుండె ఝల్లుమంది. అదంతా తగని ఉదంతం అని నీతులు చెప్పాడు.

దాంతో నేయి పోసిన అగ్గిలాగా భగ్గు మంది. వెతలు తీరని వెతతో ఏమేమో అంది. ఆ మిదట అతని అందాన్ని పొగిడింది. ఆగలేక పైబడి కౌగిలించింది.

చంద్రుడు తార అందానికి బందీ అయ్యాడు. శృంగార బందీ అయ్యాడు. శృంగార సంబంధి అయ్యాడు. అలా వాళ్ళిద్దరూ శృంగారకాండ సర్వస్వం పరస్పరం పాఠం చెప్పుకుంటూ వుండగా వచ్చాడు బృహస్పతి.

వచ్చిన తర్వాత కుశల ప్రశ్నలు అయ్యాక వాళ్ళ అన్యోన్యత చూసిన ఆయనకు అనుమానం వచ్చింది. ఇది పరిచయంతో ఏర్పడిన చనువో లేకపోతే మరో బంధ సంబంధమో చూద్దాం అనుకున్నాడు.

పరిహాసాలు, కను సన్నలు, బొమముడిపాట్లు, సర సోక్తులు, మర్మ గర్భ సంభాషణలు చూశాడు. కోపంతో తారను పిలిచాడు.

నువ్వు సాధ్వివి అనుకున్నాను. ఇలా చేశావేం. ఆ మూర్ఖుడ్ని శిష్యుడనుకున్నాను. వాడలా ప్రవర్తించాడేం? మీవల్ల అపకీర్తి వచ్చిందే! పెద్ద లెవరూ లేకుండా మీ ఇద్దర్నీ ఒంటరిగా విడిచి వెళ్ళానే అదీ నా తప్పు. పెద్ద తనం వచ్చి బుద్ధి పెడతల పట్టింది! ఎంత పాపం చేశారు మీరు!

నన్ను నాన్నా అనీ, నిన్ను అమ్మగారు అని పిలిచే వాడే. అన్నీ వేదాలు చదివాడే ! అలా చేశాడేం ! నిజం ! ఆడు వారిని నమ్మకూడదు. మీకు నిలకడ వుండదు. వావి వరసలు వుండవు. స్నేహం లేదు. భయం లేదు. చంచల హృదయులు. దురాత్మకులు. అబద్ధాల కోరులు అంపకే రాజులు అంతః పురాల్లో పోతుటీ గనైన రానివ్వరు...

ఎందుకా ఏడుపు? ఏమిటలా బొటన వ్రేలు నేలరాస్తావు. మీ శీలమంతా దివ్య దృష్టితో చూశాన లే ! ఇంతకీ రెచ్చ గొట్టింది నువ్వా? వాడా? చెప్పు.... తప్పు చేసిన వారిని శిక్షిస్తాను....

భర్త మాటలు వింటూ - తప్పు చేసిన వారిని దండిస్తా మన్నారు.... నిజానికి తప్పు చెయ్యందెవరు ? ఆ బ్రహ్మగారి కూతురు అహల్యే తప్పు చేసిం దంటే నేర్చి నడువ ఒకరి తరమౌతుందా? ఎలాగైనా మగవాళ్ళు ఓర్చుకోవాలి. లేకపోతే మీకే నగుబాటు కదా ! అని భర్త పాదాల మీద వాలి ఎక్కిళ్ళు పెస్తూ ఏడ్చింది...తార....

ఇంకేం అంటారు బృహస్పతి....చంద్రుడ్ని పిలిచి....ఊరికి వెళ్ళిరా అని పంపేశాడు. చంద్రుడు కూడా భయ భక్తులతో సెలవు తీసుకుని వెళతాడు.

వియోగంలో ఇద్దరూ మునిగిపోతారు. కొన్నాళ్ళకు తాళలేక వచ్చి గురుపత్నిని లేవదీసుకుని వెళతాడు చంద్రుడు. బృహస్పతి ఇంద్రుడికి కథంతా చెప్పి తన భార్యను తిరిగి తెప్పించ మంటాడు. ఇంద్రుడు యుద్ధం ప్రకటిస్తాడు చిత్రంగా బృహస్పతి శత్రువైన శుక్రుడు చంద్రుడికి తోడౌస్తాడు. పెద్ద పోరు జోరుగా జరుగుతుంది. చివరికి రాజీగా—

శివకేశవుల యుద్ధాన్ని బ్రహ్మ ఆపు చేస్తాడు.బుధుడు తార కుమారుడు చంద్రుని తనయుడే అని నిర్ధారించి అబ్బాయిని చంద్రుడికి తారను బృహస్పతికి ఇప్పిస్తాడు బ్రహ్మ—

శేషం వేంకటపతి చమత్కారాలు అడుగడుగునా ఆస్వాదించ దగ్గవి.... ప్రతి పదంలోనూ చమత్కారం రంగరించడం చేమకూర వెంకన్న నేర్పించిందే అయినా దాన్ని బాగా వంట పట్టించుకుని ప్రదర్శించిన వాడు వేంకటపతి మాత్రమే !

—o—

# పూపుల పరిమళాలు

ఆ ఊళ్లో పూలమ్మేందుకేపూబోడులు ఉంటారు వాళ్ళు పూలమ్ముతూ పూలమ్ములలాంటి మాటలు విసురుతు ఉంటారు. పూలు కొంటానికే కాకుండా మాటకొంటానికే కొందరు వయసుకాండ్లు వస్తుంటారు. అక్కడ పూలు దండలు కట్టి ఉంటాయి. కలువ పూగుత్తులు ఉంటాయి. సంపెంగలుంటాయి. మల్లె లుంటాయి. వాటిని కొనడానికి పైకొనడానికి వయసు తొందరచేసే పడచువాళ్లొస్తారు రెండర్థాల వ్యాపారం వాగ్వ్యాపారం జరుగుతుంది. జనాంతికంగా స్త్రీ జనాంతికంగా భావం స్ఫురించేలా మాటలు విసుర్తారు. మూటలున్న మారాజులు మోజున్న మారాజులు కావడంతో అమ్మాయిలు అందుకు తగ్గట్టుగానే సమాధానం చెబుతారు.

వెలది యీ నీదండ వెల యెంత?

నా దండకును వెల పెట్టనెవ్వని తరంబు

కలువ తావులు గాన మలికదంబక వేణి

కలువ తావులు వాడకయ కలుగునె?

కడివోదు నాకిమ్మ పడతి గేదంగినన

కడివోమి ముందరికి జూడు

జాతులే వంబు జేక్షణ

పద్మినులు సైతమును నున్నయెడ జాతులునికి యరుదె

ఆ ఊర్లో వేశ్యలు కూడ తక్కువవారా? తాంబూలం వేసుకోవడంవల్ల పళ్ళమీద వచ్చిన కప్పును వరిగింజతో తొలగిస్తారు. పసుపు పూసుకొని స్నానం

చేసి కస్తూరి పెంపు కాకుండా పయ్యెదలోపలే చెయ్యాడిస్తారు. కలసి కలియక ముందే ఎలాంటి వాడినైనా వాడి కులం కనుగొంటారు. ఒకప్పుడు తమను పోషించి ఆ మీద పేదవాడైన విటుడ్ని ఆదుకుంటారు. కవిత్వం కమ్మగా చెప్ప గలరు కూడా.

ఆ ఊళ్లో వరిమళ్ళకు కావలిఉండే ఆడవాళ్ళు-పక్కున నవ్వుతారు. ఎందుకంటే ఆ ఊరి ఏటి ఇసుక తిన్నెల్లో బాతులు తలదూర్చి నిద్రిస్తూ ఉంటే వాటిని చూసిన తలార్లు అవి వేకువ స్నానానికి వచ్చి స్నానంచేసి విడిచి మరచి పోయిన బ్రాహ్మణుల మడిబట్టలు అనుకొని తిరిగి వారికివ్వాలని వాటిని తీసుకోబోతే అవి రివ్వున ఎగిరిపోతాయట అది చూసిన ఆడవాళ్ళు నవ్వుతారు.

అదే ఊళ్లో విష్ణుచిత్తులవారున్నారు. ఆయన చేసే అతిథిసేవే సేవ! వేసవిలో వర్షర్తులో చలికాలంలో ఏకాలానికి తగిన భోజనం ఆవిధంగా ఎందార గింప జేస్తారాయన. ఆయనకు భార్యంటే ఎంత ప్రేమనుకున్నారు. జడి వానలో పొయ్యిమంటకి భార్య కళ్ళు పొగచూరి నీళ్ళుకార్తాయని ఎండు కొబ్బరి బోండాంలు దాస్తాడు. అంతేనా ఆయనకి అతిథులంటే ఎంత గౌరవం? ఎంత ప్రేమ!

ఆ నిష్ఠానిధి గేహసీమ నడురే యాలించినన్ మ్రోయునెంతే నాగేంద్ర శయాను పుణ్య కథలుం దివ్యప్రబంధాను సంధానధ్వానము 'నాస్తిశాక బహుళతా' నాస్త్యుష్ణతా నాస్త్యపూ పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్యమన్ మాటలున్.

అయ్యా! కూరలు దండిగా లేవు. వేడిగా లేవు. పప్పులేదు. పూర్ణం లేదు. అన్నంకూడా అంతగాబాగా లేదేమో తమరు పేకమించి వచ్చారు. దయతో భోంచేయండి. అని దాసవచనాలు చెప్పుకుంటాడు.

ఆయన్ని ఓరోజు విష్ణువు మత్స్యధ్వజుని సభకు పొమ్మన్నాడు. మన్నారు మాటలు విన్న ఆయనకు భయంవేసి నేనేం చదువుకోలేదు నేనేదో నీగుళ్లో పూదోటలో గొప్పులు తవ్వి పూలు పూయించడం నేర్చినవాడిని మీ ఇంటి దాసుడ్ని-నన్నక్కడికి పంపిస్తే-నాకు-కాదుకాదు తమకు ఓటమి కాదా!

నాకు చాతనయ్యింది గృహ సమ్మార్జనమో-జలాహరణమో శృంగార పల్యంకి కావహనంబో వనవాటికి కరణమో వాల్లభ్యలభ్యధ్వజ గ్రహణంబోవ్య జనాత పత్ర ధృతియో........

ఆ భక్తికి విష్ణువు మెచ్చుకున్నాడు.

నీ ఇచ్ఛయే మిన్నక పోవోయి-అని గెలిపింతు పో అన్నాడు. ఈయన ఈసురోమని వెళ్ళాడు.-అక్కడ వేరే కథ.... విష్ణుచిత్తుడే గెలిచాడు.

ఆ మధ్యలో వర్షం వచ్చింది. అదెలా బాధించింది అంటే మట్టిమిద్దెల వారికి మరుపనులకు నెలతబాసిన వారికి నిద్ర చెడగొట్టింది. కాలం గడిచింది. ఆ విష్ణుచిత్తుడికి ఓ పుత్తడి బొమ్మ దొరికింది. ఆయమ్మ గోదాదేవి. ఆమెని పెంచి పెద్దచేసినాడు ఆమె దేవుడికోసం పూలమాలకట్టి తన జడలో తురుముకొని ఆపై దేవుడికి అర్పించేది. అంచేత ఆముక్తమాల్యద అయ్యింది. ఆమె కథ అడుగడుగునా ఆనంద తాండవమే-

ఆపై ఓ విష్ణుభక్తుడున్నాడు. అతనిది పేరుకొనరాని కులం అతడు మంగళకైశికీ గానం చేస్తాడు-ఓ రోజు వేకువైందని ముందే లేచి వెళుతూఉంటే-అది అపరాత్రి కాబట్టి బ్రహ్మరాక్షసి ఘింగబోయింది. నేను నిత్య ప్రార్థనచేసి తిరిగి వస్తాను. ఆపై మింగి తిను అంటాడు. రాక్షసుడు పకపకా నవ్వి ఇలాంటి మాటలు చెప్పకు అంటే ఒట్టుపెట్టి వెళ్ళి తిరిగొచ్చి అంటాడు.

నీ చెరబాసిపోయి రజనీచెర జక్రికిభజింప ముక్తిపొందే చెర యె చెరల దవులను ఇక నుండగ జూడు-

నువ్వు పంపేప్పుడు ఎలా ఉన్నానో ఏ చరణంబులే యుదర మేయుర మేశిర మే కరంబులీ వా చరణంబు లా యుదర మాయుర మాశిర మా కరంబులన్ జూసుకోవయ్యా!

అవే పాదాలు-అదే కడుపు-అదే రొమ్ము-అదే శిరస్సు-అవే చేతులు-ఏం మార్పులేదు.-ఊ తిను.... అంటే ఆరాక్షసి దిమ్మెరపోయి దిమ్మతిరిగి పాదాలమీద పడ్డట్టె రాజీకి వచ్చి రక్షించ మంటాడు. ఉహూ అని పాటలో పద భాగం ధారపోస్తాడు భక్తుడు.

ఆ ఊరిని ఇంత మధురాతి మధురంగా చెప్పిన పుస్తకం ఆముక్త మాల్యద. దాన్నంత తీయతేనియలా చెప్పిందెవరనుకున్నారు.

తెలుగ దేల యన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకండ
యెల్ల నృపులు గొలువ ఎరుగనే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స!

అని బజాయించి చెప్పిన శ్రీకృష్ణదేవరాయలు ! తెలుగుకు తెలుగుదనానికి తెలుగు కీర్తికి వెలుగు దెచ్చిన ప్రభురాయడు - ప్రబలరాజాధిరాజ వీరప్రతాప రాజ పరమేశ్వరార్ధ దుర్గా నదేశ సాహితీ సమరాంగణ సార్వభౌముడు!

# సఖీ ! శకుంతలా !

మన తెనుగు భాష తీరు తీయదనాన్ని తీరుతెన్నుల్ని ప్రపంచస్థాయికి తెచ్చినవి మను చరిత్ర, వసు చరిత్ర, ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యము, శృంగార నైషధం, మహానుభావులైన అల్లసాని పెద్దనామాత్యుడు రామరాజ భూషణుడు అనబడే భట్టు మూర్తి, తెనుగు రాయుడైన శ్రీకృష్ణదేవ రాయలు, తెనాలి రామలింగడిగా ప్రసిద్ధికెక్కిన రామకృష్ణకవి, శ్రీనాధకవి సార్వభౌముడు ఈ మహా కావ్యాన్ని మనకు ప్రసాదించిన మహానుభావులు, వీటినన్నిటిని కలిపి తెలుగు పంచ కావ్యాలు అంటారు.

సంస్కృతంలో అయిదు ప్రసిద్ధ కావ్యాలున్నాయి. ఆ సంప్రదాయాన్ని అనుసరించే తెలుగులోనూ ఈ పంచకావ్యాలు ఎన్నిక చేశారు. సంస్కృతం లోని ఆ కావ్యాలు కాళిదాస మహాకవి రాసినమేఘ సందేశం, కుమార సంభవం, రఘు వంశం, భారవి కిరాతార్జునీయం మాఘుడి శిశిపాల వధ. అయిదు కావ్యాల్లో మూడు కావ్యాలు రాసిన మహాకవి కాళిదాసు నాటకాలూ రాశాడు. అవి మూడు జగత్ప్రసిద్ధి కెక్కిన అభిజ్ఞాన శాకుంతలం, విక్రమోర్వశీయం, మాళవి కాగ్ని మిత్రం.

కావ్యాల్లో మేఘ సందేశానికి ఎంత పేరు ప్రతిష్ఠలు వచ్చాయో నాట కల్లో అభిజ్ఞాన శాకుంతలానికి అంత ప్రఖ్యాతి ప్రశంసలు వచ్చాయి. ఇతరులు ఎవ్వరూ సృష్టించలేని అపూర్వ శోభతో "శకుంతల" ను తీర్చిదిద్దాడు. ప్రపంచ ప్రఖ్యాతి పొందింది శాకుంతలం ఎన్నో భాషల్లోకి అనువాదం పొందింది. కావ్యేషు నాటకం రమ్యం, నాట కేషు శకుంతలా అని సర్వే సర్వత్రా శిఖర స్థాయి చేరుకుంది. ఆ నాటకం.

ఏమిటి శాకుంతలం గొప్పదనం?

ఏమిటి కాళిదాసు గొప్ప ?

ప్రపంచ సాహిత్యంలోనే గొప్పదని గెట్ (GATHE) (జర్మన్) ఎగిరి గంతేసి చెప్పేంత గొప్పదనం ఎక్కడ్నుంచి వచ్చింది ?

పురా కవీనం గణనా ప్రసంగే
కనిష్ఠి కాధిష్ఠిత కాళిదాసా
అద్యాల్యాపి తత్తుకవే రభావా
దనామికా సార్థవతీ బభూవ—

పూర్వ కవులను లెక్కిస్తూ ఒకటి కాళిదాసు అనిచిటికెనవేలు ముడి చారట. తర్వాత అంటూ రెండోపేరు చెప్పి రెండో వేలు ముడవడానికి మరో కవి పేరే. ఆస్థాయిలో— ఆరీతిలో ఆఔన్నత్యంలో సమానమైన కవి లభించ లేదట. దాంతో అనామిక అనేపేరు ఆవేలికి సార్థక మైందట ! ఓహో కాళిదాసుకు ఎంత గొప్ప ప్రశంస.

మరో రసజ్ఞుడు నీకేంకావాలయ్యా బాబూ అని అడిగితే— తడుము కోకుండా

కాళిదాస కవితా నవం వయః
మాహిషం దధి సశర్కర పయః
యేణమాంస మబలా చకోమలా
సంభ వంతు మమ జన్మ జన్మని

ఎప్పుడూ నిత్యయవ్వనం వుండాలి— దున్నపోసిన గేదె పెరుగే కావాలి చక్కెర కలిపిన చిక్కని పాలేదొరకాలి. జింక మాంసమే తినాలి అలి అబలంగా కోమలంగా రావాలి. అంతేనా కా దాసు కవిత వినాలి .... జన్మ జన్మకూ ఇవే - ఇవే - కోరాలి— అన్నాడట, కాళిదాస కవిత అంటే అదీ !

కథ కొత్తది కాదు. సుప్రసిద్ధం అందరికీ తెలిసిందే. మరి ఎక్కడుంది కాళిదాసు ప్రత్యేకత.



యామినీ సరస్వతి

తొలిసారి శాకుంతలను చూశాడు ముని వాటికలో నివసించే బ్రాహ్మణ కన్నెపై తనమనసు పోయిందే అనివగిచాడు. అంతలోనే ఉహూ నామనస్సు ఈమె మీద లగ్నమైందంటే ఈ బాలిక తప్పకుండా క్షత్రియ కన్యే కావాలి. నామనస్సు తప్పుదారితొక్కదు అనుకుంటాడు దుష్యంతుడు అదీ కాళిదాసు ప్రత్యేకత.

సతాంహి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతః కరణ ప్రవృత్తయః

ఆ పదంలోని గొప్పదనమంతా "సజ్జనులకు" అనడంలో ఉంది. ఆమెను చూసి వలచి సొక్కి సోలిన రాజుమళ్ళి ఓసారి అనుకుంటాడు. అనాఘ్రాతం పుష్పం, కిసలయమ నూనం కరరుహై రనా విద్ధం రత్న....

ఇలాంటి చక్కటి ఉపమానాలతోనే "ఉపమా కాళిదాసస్య" అనే "రూఢీ" ఏర్పడి ఉంటుంది.

తర్వాత రాజు శకుంతలను గాంధర్వ వివాహం చేసుకుంటాడు. వేలికి ఉంగరం తొడుగుతాడు. రాజ్యానికి వెళ్ళి సగౌరవంగా మహరాజ్ఞిలా పిలిపించు కుంటానని వెళతాడు తర్వాత దుర్వాస శాపం. శకుంతల గర్భవతి కావడం కణ్వుడు కూతుర్ని అత్తారింటికి పంపుతాడు, అప్పుడే పెంచిన ప్రేమే ఇంత బాధ కలిగిస్తోందే కన్నవాళ్ళు కూతుళ్ళను అత్తారింటికి పంపుతూ ఎంత వేదన చెందుతారో అనుకుంటాడు.

(యా స్యత్యద్య శకుంతలేతి....
పద్యంతే గృహిణీః కదంను తనయా విశ్లేష దుఃఖైర్నవైః)

'నాటకేషు శకుంతలా' అన్న తర్వాత "తత్రాపి చతుర్థాంకః" "తత్రశ్లోక చతుష్టయం" అని ప్రసిద్ధి కెక్కిన శ్లోకాలలో ఒకటి ఇది కావడం. వకటవదే ఇది.

హృదయాన్ని స్పృశించేలా "పాత్రల" తో మాటాడించడం లోకరీతి ధ్వనించడం కాళిదాసుకే చెల్లు. ప్రతి మాటా పది పుటల వ్యాఖ్యానాన్ని కోరే

అర్థ గంభీర రచన కాళిదాసు సొత్తు. నిజంగా ఆయన "నవరత్నాల్లో" ఒక మేలి రత్నం. విక్రమార్కుడి ఆస్థానంలో నవరత్నా లుండేవాళ్ళట - వారు.

ధన్వంతరి క్షపణ కామర సింహశంకు
భేతాళభట్టు ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరహ మిహిరో నృపతేః
సభాయాం రత్నానివై వర రుచి ర్నవ విక్రమస్య
అందుకే ఎవరో మహాను భావుడన్నారు.
జయంతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయం.

—o—

# జనం గానం

ప్రభువులు పద్యాలకూ పద్య ప్రబంధాలకూ పట్టంగట్టే రోజుల్లో పదాలకు ప్రాముఖ్యత ఇచ్చిన వాళ్ళు ప్రజలు— మామూలు మాటలతో రస పేటికలులా భావాన్ని పంచి ఇచ్చిన "బయకారుల" బ్రతుకు బంగరుమయం చేసిన వారు ప్రజలే! పొలం పోతూవస్తూ, పొలాల్లో పనులు చేసుకుంటూ, పెళ్ళి పేరంటాళ్ళలో సంప్రదాయాన్ని నిలుపుకుంటూ, కొలువుల్లో గుడిసేవలో. ఇక్కడా అక్కడా అనికాకుండా జన జీవితం సారవంతగా వుండే ప్రతి చోటా 'పాటలే' పదవి అలంకరించాయి. పండిత సభల్లో, రాజసభల్లో మాత్రమే పద్యం నాట్యం చేస్తే అడుగడుగునా చిందు వేసింది పదమే ...... దాన్నే జనంపాట అన్నారు.

ఎంత పేదవాడే వేణుగోపాలుడెంత పేదవాడే....

ఇదిపల్లవి.... ఎత్తుగడలోనే ఎంత భావశబలత!

వేణుగోపాలస్వామిట - పేదవాడట - అదీ రెండుసార్లు రెట్టించి పలుకుతున్నాడు భువన పాలకుడై అందరికీ సంపద పంచి ఇచ్చే దేవుడై గుడి కట్టుకుని నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలతో వైభోగం అనుభవించే గోపాలుడు పేదవాడా! ఏమో! కవిగారు వూరికే అనరుగా! అంత పేద గాకుంటే— అలనాడు కూచేలుని అటుకులకు చేసాచునా— ఓ చెలులార.

శభాష్! అదీ జవాబు - వేణుగోపాల స్వామి ధనికుడే అంటారా! మేం ఒప్పం బాబూ! పేదవాడు కాకపోతే కూచేలుడు చెంగున మూటగట్టుకుని వచ్చిన పచ్చి అటుకులుచేసాచి అడిగి తీసుకుని మరీ తింటాడా! అది పేదవారి ఆహారం! దాన్నే అభిలషించిన ఆయన ఇంకెంత పేదవాడో కదా! కవిగారి వాదనను కాదన గలమా?

ఇంకా ఏమేమి ఉపపత్తు లిస్తాడో విందాం !

పండమంచమె యుంటె భావజనకుడీ
పాముపై నిద్రించునా
అండవేరే యుంటే అచ్యుతుడా దనుజనీ
అవనీ దానమడుగునా
వుండ నిల్లే వుంటే పుండరీకాక్షుడు
యుదధి వాసము చేసునా ఓ చెలులార !

పాపం ! జగదేక పాలకుడే అయినా పడుకోడానికి కనీసం ఓ కుక్కి మంచమైనా లేదే !

అందుకే పాము పడక వేశాడు. ఏ దిక్కూలేక ఏమీ లేకనే బలి చక్రవర్తిని మూడడుగుల నేల బిచ్చ మడిగాడు ! ఇల్లు కట్టుకోడానికా ! కాదు. పండించు కోడానికా ? కాదు - ఊరికే పడుకోటానికి ! ఇల్లు లేకనే కదా ఆయన సముద్రంలో కాపురం పెట్టింది. పాపం ! ఈ నాటి మనం ఆనాటి ఆయన కంటే మెరుగే నేమో !

కట్టు వస్త్రమె యుంటె కంస వైరిగో - పాం
గన చీర లా శించునా
గొట్టు బడక యుంటె గోవిందుడీ గతి
గోవుల తాగాచునా
పొట్ట నిండితే శౌరి పొరుగిండ్ల జొరబడి
పొంచి వెన్న ముచ్చిలునా ఓ చెలులార !

నిజంగా ఎంత దీన జీవనం ! కట్టుకోడానికి బట్టలేదు (బట్టలు కాదు), జీవనాధారం లేదు. కష్ట పడినా కడుపు నిండదు. అందుకనే గోపికల చీరలు తీసుకున్నాడు. గోవులు కాచాడు. గొల్ల వాళ్ళ ఇళ్ళలో జొరబడి పాలు వెన్న దొంగిలించాడు ! చెప్పండి అది ఆయన నేరమంటారా ? కాదు ఆకలిది. ఆకలి కోసం ఆవులు కాచాడు. అది తీరక పోతే అందరిళ్ళలో (కొందర్ని దోచి కొందర్ని వదల్లేదు) పాలు వెన్నలు తినేశాడు - వెండి బంగారు ఎత్తుక పోయ్యేడా

కట్టుకోడానికి మారు బట్టలేక పోవడం వల్లే గుట్టలుగా పడి వుండడం చూసి గోపికల చీరలు ఎత్తుకెళ్ళాడు !

పరిపాటి వాహనమీ ప్రద్యుమ్ననికేవుంటే
పక్షినెక్కి తిరుగునా
దరివేరే వుంటే శ్రీధరుడనిశము నిజ
దాసుల పంచ జేరునా
గురియైన సాయి కమీ మురవైరి కేయుంటె
గరిక పోచ బట్టునా ఓ చెలులారా !

ఎక్కడానికి వాహనం ఏదీ లేదు ! హంస ఒకరికి - నెమలి ఒకరికి - చిలుక ఒకరికి అలా అలా పోయాయి. రథం లేదు, గుర్రం లేదు, ఏనుగూ లేదు. అందుకే గద్ద నెక్కాడు. మాదేవుడు. ఎవరూ దిక్కులేరు, దగ్గరికి చేరనివ్వరు. అందుకే నిజదాసుల పంచకు వస్తాడు. మా ప్రభువు ఆయుధం సరియైంది ఏదీ లేదు. త్రిశూలం ఒకరు వజ్రాయుధం ఒకరు అలా అలా తీసేసుకున్నారు. అందుకే కాకా సురుడ్ని హతమార్చేందుకు గరికపోచే ఆయుధమైంది.

ఇప్పుడు చెప్పండి - మీరే ఆలోచించి చెప్పండి.

కట్ట బట్ట లేదు. ఉండడానికి ఇల్లా లేదు. తినడానికి తిండి లేదు. ఊడిగం చేద్దామంటే మంచి ఉద్యోగమూ లేదు మరి మా వేణు గోపాలస్వామి పేదవాడు కాదంటారా ! మీరు కాదన్నా ఆయన పేదల్లో కెల్లా పెద్ద పేద !

ఈ మనోహర గీతం – కీర్తన ఆలపించింది. సారంగ పాణి, పద రచనలో సారం గలపాణి....

శృంగార సంకీర్తనలు, దేశీయాలు,జాతీయులు, వేదాంతం తన పదాల్లో బంగరు బయలు చేసిన భావుకుడు కార్వేటి నగర గోపాలునికై సేసిన పద బంగారాలు.ఒక్క పదం చాలు వేల వరహాలు చేస్తుంది. గుండెల్లో దూసుకపోయి కుదురుగా కూర్చునే పదాలు - పద చమత్కారాలు ఎన్నో - చేమకూర చేసిన చమత్కారం తన పదంలో భద్రపరిచిన తీరు చూద్దాం.

మగువను సభల నెన్నుదురు

మామ నదిలించు నెన్నుదురు ఆ

వగలాడి పల్వరుస కుదురు మేటి

వజ్ర మణులనుచు బల్కుదురు ఈ

జగతి దాని కెవ్వరు నదురు విరి

జాజులం పె నీకు నదురు....

మాటల చమత్కారం కాదు. నడకలో, పయ్యారాలు, పగలూ కూడా ప్రదర్శించాడు.

ఇలాటి భావాలు ఇంకెన్నో ! మనసుతో ఆనందించియ్యెమరిచే ఈ పద కవితలు కృత్రిమ భావాలతో వికృత భావాలతో పిరబూస్తున్న ఈ రోజుల్లో మానసిక చికిత్సకు మంచి మందులు— కుహనా నాగరికత వేళ్ళూనుతున్న సాహితీ రంగానికి శస్త్ర చికిత్సలాటివి పదకవితలు అవి చదవందే తెలుగు రాదు మన భాషకు వెలుగురాదు.

# కాళ్ళా వేళ్ళా పడిన వేయి కళ్ళవాడు

అది ఒక పుణ్యాశ్రమం. మిథిలకు వెళ్ళే దారిలో ఉంది. అక్కడ ఎప్పుడూ గౌతమ సూత్రాలు వినబడుతూ ఉంటాయి. అది మహర్షి గౌతముల ఆశ్రమం. ఆయన సామాన్యుడు కాడు. మాన్యుడు. సమ్మాన్యుడు. అంతే కాదు ఆయన సాక్షాత్తు బ్రహ్మ అల్లుడు. ఆ బ్రహ్మ కూతురు అల్లాటి ఇల్లాటి అమ్మాయి కాదు. అందగత్తెలలో అందగత్తె.

అసలదెలా జరిగిందంటే -

ఒక రోజు స్వర్గంలో తగాదా వచ్చింది. అందరిలోకి అందెగత్తె ఎవరూ అని, అప్పుడు వరుణుడు దేవేంద్రుడితో ఊర్వశి అందగత్తె అన్నాడు. అప్పుదేమో ఇంద్రుడు ఆ మాట నిజమనేశాడు. అంటే కుబేరుడి కుమారుడు నల కూబరుడు అడ్డొచ్చి అదేం కాదు. రంభే చాలా అందగత్తె అందుకే నారీషు రంభ అనే సూక్తి పుట్టింది అన్నాడు.దాంతో ఒకరు ప్రమోచనూ, మహర్షి విభాండకుడుఁ ఋష్య శృంగుని తండ్రి హరిణిని, ఇంకొకరు ఘృతాచిని మరొకరు తారను, హేమ, మదాలసను పొగిడి పేర్కొన్నారు.

ఆపై విశ్వామిత్రుడు
కన్నులు చేరలం గొలవ గాదగు గౌనర పేద చన్నులా
కిన్నెర కాయలం గెలుచు కీల్జెడ బారకు మీరు మోముక
ప్పున్నమ చందమామ యొక పోలిక వాలిక తూపు చూపు నా
కన్నుల యాన దాని కెనగాన జగాన మొగాన పల్కెదన్

అని మేనక ప్రశంస చేశాడు.

దాంతో చర్చ పూటెక్కి వ్యాసుడు దాశకన్య అంద చందాలు వాయుపు అంజనీదేవి చారు సౌభాగ్యాలు అలా గలభా రేగి ఎవరి కిష్టమైన స్త్రీ పేర్లు వాళ్ళు చెప్ప సాగారు.

ఈ గోలంతా ఎందుకని ఇంద్రుడు అందర్నీ కూడగట్టుకొని సాక్షాత్తూ సృష్టికర్త వద్దకే జగడం తీర్చమని వెళ్ళాడు. ఆయన అంతా విని ఒక్కొక్కరికి ఒక్కో లోపం చెప్పి అవేవి లేని అంగనామణిని మదిరాక్షిని సృష్టిస్తానని చెప్పి.

కుదురై ఒప్పుల కుప్పయై గోరంత నొచ్చంబులే నిదియై
నొవ్వని జవ్వనంబు గలదై నిద్దంపు టొయ్యారియై
మదనోజ్జీ వినియై గరాగరికయై మాణిక్య పుంబొమ్మయౌ

మదిరాక్షిన్ సృజియింతు – అని పంతం పట్టి సృష్టించి ఇచ్చిన సుందరాంగి అహల్య. ఆమెను చూచి అచ్చరలంతా తబ్బిబ్బయ్యారు. దేవతలంతా [illegible] ర్లారు. మునుల మనస్సు చెదిరింది.

అయితే ఇంద్రుడి దృష్టి ఆమెమీద పడింది. ఆమె అతడితో చూపు చూపూ కలిపింది. దాంతో అతడు పేట్రేగి నరుల్లో కిన్నెరుల్లో కింపురుషుల్లో సిద్ధసాధ్యుల్లో ఋషుల్లో ఈమెకు తగినవాడు ఎవరూ లేడు. దేవతల్లోనేనే తగిన వాడ్ని. ఆమెనిచ్చి పెండ్లి చేయి అని అడిగాడు. దానికి బ్రహ్మ పకపక నవ్వి నిన్నే పొగడుకోవడం తగదోయ్ ఇంద్రా ! నాకు అల్లుడు కాదగినవాడు. అహల్యకు భర్త కాదగినవాడు గౌతముడు అని అప్పటికప్పుడు అహల్యను గౌతముడి కిచ్చి పెళ్ళి చేశాడు.

అహల్యా గౌతములు అడవిలో కాపురం పెట్టారు. అలా ఉండగా ఒక రోజు గౌతముడు ఇంట్లో లేని వేళ చూసుకొని వచ్చి ఆశ్రమంలో జొరబడి పాకశాసనుడు ఆ పూరి పాక ముందు నిలబడి ప్రశ్నించాడు. అహల్య పలికింది.

మాటా మాటా సాగితే సిగ్గ ననేగి నవ్వుచున్ అయితే ఇంద్రుడికి లోపలికి రావడానికి సాహసం చాల్లేదు. ఆపై ఒక జగజంత రాయభారం చేసింది. దాంతో ఓ రాత్రి కాచి వేచి వీలు చూసుకొని లోపల చొరబడ్డాడు అదీ గౌతముడి వేషంలో.

అహల్యకు వచ్చింది ఇంద్రుడని తెలీదూ ? ఏమో !

వేకువ స్నానానికి వెళ్ళిన మొగుడు (మగడు) అంతలోనే ఇంట్లోకి వస్తే మగడో మగడి రూపంలో ఉన్న ఇంద్రుడో తెలీదా ? ఏమో ! ఏమైతేనేం అహల్య మేను పులకించేలా జీవితానందం పొందింది. ఏరూపంలో నైతేనేం ఇంద్రుడి కోరిక తీరింది. అంతకు ముందు ఇద్దరి మధ్య పసందైన సంభాషణ జరుగుతుంది.

దాంతో ఆమె నవ్వుతూ నా మగని వేషభాషల నేమిటికి ధరించివచ్చి తెరుంగ జెపుదూ అంటే నీ మగని రూప మౌటకు పై మాటలు నడవందె పంకజ గంధీ అంటాడు ఇంద్రుడు నిజానికి ఈ మాటలలో కంటే అంతకు ముందు మాటల్లోనే గడుసుదనాలున్నాయి.

దేవా ! శచీ మనోరమణా ! అంటుందామె అమె మనస్సుని శరీరాన్ని ఆనందింప చేసే వాడివి అంటూ నర్మగర్భంగా అంటే ఇంద్రుడు అంటాడు. నీదు శోభా విభవం చూడ్డానికి వచ్చానంటాడు. ఇదెంతో అర్థం ఇముడ్చుకొన్న మాటకదా ! తర్వాత వనితా నవమన్మధా ! అని సంబోధిస్తుంది.

దానికి భావజునాన అంటాడు. మన్మధుడి ఆజ్ఞతో అని అర్థం మన్మధుడి ఆజ్ఞగా మన్మధ తంత్రానికి వచ్చానని ధ్వనించాడు ఇంద్రుడు. ఆమె చాలు చాలు ఇక వెళ్ళు ఈ మాటలు చాలించి వెళ్ళు అంటే ఇంద్రుడు. కాళ్ళావేళ్ళ పడ్తాడు.

బెట్టు తగ్గకుండా ఒప్ప ఒప్పనట్టు ఒప్పుకుంటుందా ఒప్పుల కుప్ప ఆమె నియమాలన్నింటికీ గతి లేక అంగీకరిస్తాడు ఇంద్రుడు.

తరువాత ఇంద్రుడు మహేంద్రానందాన్ని అనుభవిస్తాడు. అపై తెల్ల వార బోతుందని వెళ్ళలేక వెళ్లలేక సెలవడిగితే అతన్ని విడవలేక విడవలేక అంటుంది.

నమ్మిన దాన నా తనువు నమ్మిన దానను నీకు ఇంక నే
నమ్మక చెల్ల ! నన్ను విరహాగ్నికి బాల్పడ చేసి బోవుటల్
సమ్మత మాయనా - విడువ జాలితివా ! ఎటులైన నిన్ను నే
బొమ్మన జాల చాలినను బొందిని ప్రాణము లుంచనేర్చునే

అప్పుడు వీడ్కోలు సమయంలో గౌతముడు వచ్చి ఇంద్రుణ్ని అహల్యనూ శపిస్తాడు. దాంతో కథ కంచికి వెళ్తుంది. ఈ మధురమైన అహల్యా సంక్రందన ప్రబంధాన్ని సర్వాంగ సుందరంగా ప్రతి పద్య రమణీయంగా చతుర సంభాషణమయంగా తీర్చింది సముఖం వేంకట కృష్ణప్ప నాయుడు.

# మెచ్చినా పద్యమే! నొచ్చినా పద్యమే

మహా సుఖ భోగాలు అనుభవించిన వాళ్ళకు మామూలు భోజనం రుచించదు. అలాగే సామాన్యుడి తిండీ సహించదు. మహాకవి, విద్యాధికారి, కవి సార్వభౌమ బిరుదుకల శ్రీనాథుడు అలా తటస్థ పడినపుడు విసుక్కొన్నా - వేసటపడినా అందంగా ఉంటుంది మరి. కంకణాల చేతులకన్నె మొట్టినా మోహనంగానే ఉంటుందట. మధుర వాణి తిట్టినా కమ్మగానే ఉంటుందట మరి!

అదేదో ఊరు ఏ ఊరైతేనేం అది పలనాడు మండలంలోని పల్లె అక్కడికి వెళ్ళాడు శ్రీనాథుడు. మహారాజ భోగాలు అనుభవించిన వాడికి ఆ ఊరు - ఆ నీరు - ఆ అన్నం - ఆ వనం....ఏవీ నచ్చ లేదు. దాంతో మొత్తం ఆ సీమనే తిట్టేశాడు.

అంగడి ఊర లేదు వరి అన్నము లేదు శుచిత్వమేమి లే
దంగన లింపు గారు ప్రియమైన వనంబులు లేవు నీటికై
భంగ పడంగ పాల్పడు కృపా పరులెవ్వరు లేరు దాతలె
న్నంగను సున్న కాన పలనాటికి మాటికి పోవ నేటికిన్

ఏదైనా ఊరు వెళ్ళితే ఆ ఊరందం నచ్చితే మళ్ళీ మళ్ళీ వెళతారు. అక్కడి జనమో, భోజనమో వనమో నచ్చాలి మరి ! ఏదీ నచ్చక వచ్చేది. ఏదో కొందామంటే దొరికే అంగడి లేక కడుపునిండా తింటానికి వరి అన్నం లేక ఏ అమ్మాయినైనా పలకరిద్దామంటే కంటికి ఇంపుగా ఎవ్వరూ కనబడక పాపం తాగేందుకు మంచి నీళ్ళు లేక ఎంత బాధ పడ్డాడో ! అన్నిటికీ మించి బాధించింది దాత లేక పోవడం.

అక్కడే కాదు! మరో సందర్భంలో కూడా పలనాటిని తిట్టాడాయన!

రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడకున్

వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్

పిల్లనిచ్చినవాడో, పిల్లను తెచ్చుకున్నవాడో పల్నాడు వెళ్ళితే వెళతారట కానీ రసికుడైన వాడు మాత్రం పల్నాడు వెళ్ళడట ! రసికుడికి కావాల్సింది మంచి వసతి, సతిని మరిపించే వారసతి ! ఇంటి తిండిని మరిపించే పూటకూటింటి భోజనం ! అవేవి దొరకవట పల్నాడులో ! అక్కడ తప్పి జారి రంభ లాంటి పడుచు ఉంటే ఆమె ఏకులు వడుకుతుందట కాని రసికుడిని పలుకరించి పడుకరించదట ! రాజో రాజులాంటి వాడో అయినా భూమి దున్నాల్సిందే! పండిన తృణమో పణమో ధాన్యమో బ్రతుకు తెరువుగా స్వీకరించాల్సందే! ఒక వేళ పరమ సుకుమారుడు - కుమారుడు. మారుడు వెళ్ళితే అతనెంత వాడైన జొన్నకూడు కుడవాల్సిందే ఎంత కడుపు మండిందో కవిసార్వభౌముడికి పాపం !

ఒక సారి ఏం జరిగిందో కానీ అంతటి మహా కవి కవిత్వమును నిరసించాడు. అదీ ఆడ పుట్టుకను. అభినందించాడు.

కవితల్ సెప్పిన పాడనేర్చిన వృధా కష్టంబె ఈ భోగపుం
జవరాండ్రే కదా భాగ్యశాలినులు పుస్త్రీంబేల పోపోచకా ?
సవరంగా సొగసిచ్చి మేల్ యువతి వేషంబిచ్చి పుట్టింతువే
నెవరున్ మెచ్చి ధనంబులిచ్చెదరు కాదే పాపపుం దైవమా !

పాపం దైవాన్ని తిట్టుకున్నాడే తప్ప మరేమీ అనలేదు. అలాగే అదే సీమలో ఏదో ఊరు బహుశా పులిపాడు కావచ్చునేమో ! అక్కడి కరణం ఈయన్ని పలకరించలేదు పన్నెత్తి. మొక్కలేదు చేయెత్తి, ఇవ్వలేదు చేచాచి ! అక్కడి గ్రామాధిపతి ఊరి పెద్ద కాపు. అందరూ అందరే! అయినా మాన్యుల్ని పొగిడేకవి సామాన్యుల్ని పద్యంతో సన్మానించాలంటే ఏదో హెచ్చోతొచ్చో ఉండాలి కదా !

ఊరు వ్యాఘ్రపనగర మురగంబు కరణంబు
కాపు కపి వరుండు కసవు నేడు

గంపుగా గనిచట గురజాల సీమలో
ఓగుల్లెల్ల కూడి రొక్కచోట

ఆ ఊరు పులిపాడు ! కరణం నాగయ్యగారు. ఊరి పెదకాపు హనుమంతయ్య, గ్రామాధికారి పుల్లయ్య ! అందరూ అందరే ! పెద్దమనుషులే !

అయితే శ్రీనాధుడికి నచ్చింది పలనాటి సీమలోని దేశభక్తి ! మాతృభూమి అంటే వారి కున్న గౌరవం ! దాన్ని మనసారా పొగిడాడు మహానుభావుడు.

వీరుడు దివ్య లింగములు విష్ణువు చెన్నుడు కల్లుపోతురా
జారయ కాల భైరవుడు నంకమ శక్తియ అన్నపూర్ణయున్
గేరెడి గంగధార మణికర్ణికగా చెలంగునీ
కారెమపూడి పట్టణము కాశి గదా పలనాటి వారికిన్

యావద్భారతం కాశ్యాం మరణాన్ముక్తి : అని చచ్చేలోగా కాశీకి వెళ్ళరావాలని తపించే ఆ రోజులలో కారెంపూడినే కాశీగా భావించిన పలనాటి ప్రజల భక్తి ప్రపత్తులు - వాళ్ళు వీరులకిచ్చే వెలలేని గౌరవం - ఎంతగానో నచ్చి కవిగారికితాబు నందుకుంది. కవిగారిని కాలం కబళించినా కమ్మని ఆయన పద్యాలింకా గుబాళిస్తూనే ఉన్నాయి.

# కప్పుర భోగి వంటకం కమ్మని గోధుమ వంట

ఆ నాడే కాదు - ఈ నాడే - కాదు - రేపు - రేపే కాదు ఏనాడైనా మనిషి కోరేవి మూడే మూడు ! కూడు - గుడ్డ - గూడు. వాటిల్లో ముందు కోరేది కూడు! తిండి కలిగితే కండ కలదోయ్ కండ గలిగిన వాడే మనిషోయ్ అన్నట్లు అన్నిటికి మించి అన్ని సుఖాలకు మించి కోరేది భోజన సుఖం. అదుంటేనే ఆపైవన్నీ.

ఒక రోజు ఓరుగల్లు నగరంలో ఇద్దరు మిత్రులు తిరుగుతూ ఎదురుగా వస్తున్న పరదేశిని చూశారు. అతడు బాగా భోజనంచేసి వస్తున్నాడు ఈ మిత్రులు పూట కూటి వంటకం గూర్చి అడిగారు. దానికి విహారములకో - ఆహారమునకో- విహారమునకో - బేహారము అని అడిగి ఆహారమునకు అంటే వినండి.

కప్పుర భోగి వంటకము కమ్మని గోధుమ పిండి వంటయున్
గుప్పెడు పంచదారయును క్రొత్తగ కాచిన యాలనే పెసర్
పప్పును కొమ్ము నల్లటి పండ్లును నాలుగునైదు నంజులున్
లప్పల తోడ క్రొంబెరుగు లక్ష్మణ వజ్ఝుల యింట రూకకున్

అయ్యా - మీరు పూట భోజనానికి ఒక రూక ఇస్తే ఆ లక్షణ వఝుల వారింట మంచి పసందైన భోజనము దొరుకుతుంది. ఎలాగంటారా? కప్పుర భోగి బియ్యంతో అన్నం వండుతారు. చేయి చురుక్కునేలా అప్పుడే కాచిన ఆవు నేయి వడ్డిస్తారు. కమ్మని వేడి వేడి పెసరపప్పుకి ఆ నెయ్యి జోడైతే నసాలం అంటు తుంది. నాలుగైదు పచ్చళ్ళు ఊరగాయలు ఉంటాయి. పైగా గోధుమ పిండి వంటలుంటాయి. అరటి పళ్ళు - పంచదార అంతేనా గడ్డ పెరుగు గుమ్మరిస్తారు. జిహ్వా తర్పణంగా వుంటుందనుకో -

బహుశా కవి గారు అలాంటి భోజనం ఆరగించాక దాన్ని గుర్తు చేసు కొని ఆ రుచిని నెమరు వేసుకొని చెప్పి ఉంటారు. ఈ పద్యాన్ని. నిజానికి సాహిత్యంలో ఎక్కువగా భోజనానికి సంబంధించిన వర్ణనలే ఎక్కువగా ఉంటాయి. ఎవరో కవి "భోజనం దేహీ రాజేంద్ర ఘృత సూప సమన్వితం మాహిషంచ శరశ్చంద్ర చంద్రికా ధవళం దధి" అని భోజుడ్ని అడిగాడట! మళ్ళా మాన్యాలు కాదు హారాలు అగ్రహారాలు కాదు అడిగింది ! భోజనం ! !

శ్రీనాధుడిలా భోజన ప్రియుడు ఎవరూ ఉండరేమో. అందుకే ఆయన కవిత్వంలో, గ్రంధాల్లో, చాటువుల్లో భోజన వర్ణనలు చాలా చోట్ల చోటు చేసుకొన్నాయి.

ఆయన విద్యానగరం వెళ్ళి ఓ మామూలు కవిగా రాజుగారి దర్శనం కొరకు పడిన పాట్లు ఒక ఎత్తు - అక్కడ భోజనం రుచించక పడ్డ పాట్లు ఒక ఎత్తు అందుకే

కుల్లా యుంచితి కోక సుట్టితి మహా కూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ తిల పిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా

చల్లా అంబలి త్రావితిన్ రుచుల్ దోసం బంచు పోనాడి తిక తల్లీ....
అని వాపోయాడు....

నిజమే మరి రాజులు పంపే దినవెచ్చాలతో హేమపాత్రల్లో సుష్టుగా సరస సల్లా పాలతో విందారగించిన కవీంద్రుడికి విశ్వస్త వడ్డిస్తే అంబలి మజ్జిగ తాగి వెల్లుల్లి తినడం కష్టమే. అక్కడే కాదు. పలనాటి సీమలో ఆయనకి ఎటు చూసినా ఎటుపోయిన జొన్న కలి జొన్న అంబలి జొన్నన్నము జొన్న పిసరు జొన్నలు తప్ప మరేమి కన్పించలేదు. అందుకే ఆ తిండి తినలేక శివుడిని సవాలుచేశాడు.

పూర్వమందు విషము పుచ్చుకున్నానని గర్వపడెదవేల గరళకంఠ!
కొండవీటి సీమపందు జొన్నల కూడు తిన్న నీదు బయసి
తేట పడును !

బహుశా కొండ నీటి జొన్నన్నం పండు మిరప పచ్చడి నోరు చురుక్కుమనిపించి ఉంటాయి. అంతే కాదు ఆ భోజనం చూసి జిహ్వ చచ్చి ఉంటుంది. దాంతో

కఠినంపు జొన్నల కటుకు కుడుములు సూచి వక్త్రమా భయపడవద్దు సుమ్మీ
నా నారుచుల్ కోరు నాలుక నీవేమి సందేహ పడవద్దు చప్పరించు
ఎన్నడు కడి చేయ నెరుగక నెట్లో యని కుడిహస్తమా నీవు జడియబోకు

కమ్మని బాసనల్ గ్రక్కున లేన్చెదు గర్భమా కుట కుట కాకయుండు అని నచ్చ చెప్పుకున్నాడు. అయితే ఈ భోజన సుఖాన్ని గూడా గుర్తు పెట్టుకున్నాడు కాబోలు.

నడినూక లేని అన్నము
వడబోసిన నెయ్యి బుడమ వరుగున్ పెరుగున్
గడిమీద నీయ బెట్టిన
నడ గూడెవు నంబి పడుచు నడిగితి ననుమీ

అని కుశలం అడిగాడు. ఇలా కబురు పంపడం ఆయనకి అలవాటే.

గుడిమీద కోతి తోడను
గుడి లోపలి నంబివారి కోడలితోన్
నడివీధి వేశ్య తోడను
నడి గొప్పుల పైరగాలి నడిగితి ననుమీ

అంటాడు ఆనందం పంచిన వారిని మరువక పలకరించడం విట ధర్మం కాబోలు

తిరిగి తిండి విషయానికి వస్తే తాగిన చల్లను గుర్తు తెచ్చుకోవడం గొప్పే

గొప్పయిన నిమ్మ పండ్లను
కప్పురమును సొంఠి పొడియు కరివేపాకున్
ఉప్పును యేలకు ఇంగువ
ఒప్పుగ నీ చల్ల రుచికి నొన గూర్పదగున్

ఇలా విశేషంగా వర్ణించడం ఒక కళే గదా! హాయిగా భోజనం చేసిన వారికి నసిలేని భోజనం పెడితే చుర్రు మనదూ ? అందుకే ఆ దేవుడ్నే మళ్ళీ సవాల్ అన్నాడు శ్రీనాధుడు.

పుల్ల సరోజ నేత్ర అలపూతన చన్నుల చేదు తావినా
నల్లదవాగ్ని మిగింతి నటంచును నిక్కెదవేల తింత్రిణీ
పల్లవ యుక్తమౌ ఉడుకు బచ్చలి శాకము జొన్న కూటితో
మెల్లన ఒక్క ముద్ద దిగ మింగుము నీ పస కాననయ్యెడిన్

ఇలా తిండి మీద దండిగా కవిత చెప్పిన కవులు అరుదే - శ్రీనాధుడే అందుకు శ్రీకారనాధుడు.

—○—

# రసిక శృంగారంలో రమణీయ బోధనలు

రఘునాథ నాయకుడు ఆయనకుమారుడు విజయరాఘవ నాయకుడు శృంగారానికి రాజముద్ర వేశారు రాజానుమతో ధర్మః అన్నట్టుగా రాజుగారి బుద్ధి ఎలా నడుస్తూ ఉంటే అనుచరులు అనుయాయులు అలాగే ఉంటారు. రాజు రసికుడు కావడంతో రాజాస్థానంలోని కవులు 'శృంగారానికి'కే పట్టం కట్టారు. అయితే అందులోనూ కొంతమంది కవులు తమ ప్రతిభా పాటవాలని చూపించక పోలేదు వర్ణనాత్మకంగా సాగే ప్రబంధరచనల్లో కవి తన పాండిత్యమను ప్రదర్శిస్తూ చమత్కారాన్ని రంగరిస్తు ఎంత బాగా రచన చేయవచ్చో విజయవిలాసం చెబ్తూ ఆలాంటి రచనలకి విలాసం కల్పించింది. వాటి వావిలో వరుసలో పుట్టినా వన్నెచిన్నెల్లో విశిష్టతను సంపాదించుకొంది "హంసవింశతి."

ఇందులో కథ చాలా చిన్నది. ఒక చిన్నది హేమావతి. భర్త దేశాంతరం వెళ్ళితే ఆతని భార్య రాజుగారితో కలయిక కోసం సింగారించుకొని బయల్దేరుతుంది. అయితే ఆ ఇంట్లో ఉన్న 'హంస' రాజుగారి కోసం తయారై వెళ్ళే హేమావతిని ఆపి 'రంకు నేర్చినమ్మ బొంకు నేర్వాలి' నీలో ఆసామర్థ్యం. ఆ సమయజ్ఞత ఉన్నాయా అని అడిగి - ఓకథ చెప్పి ఆ కథలో విచ్చలవిడిగా తిరిగి తప్పించుకొనే ఓ జాణపేరు చెప్పి అంతట దానివాఅని అడుగుతుంది.

తనని తాను ప్రశ్నించుకొన్న హేమావతి వెళ్ళేందుకు ధైర్యం చాలక ఆగిపోతుంది. అలా ఇరవై రోజులు గడిచి పోయాయి అంతలో హేమావతి భర్త విష్ణుదాసు తిరిగివస్తాడు. దాంతో రాజు చిత్రభోగమహారాజు, హేమావతి 'బుద్ధి'మంతులౌతారు. కథ కంచికి మనం ఇంటికి ఓ మంచి ప్రబంధం. ఇంత వింతయిన పుస్తకం శుకసప్తతి ఉంది. కానీ హంసవింశతి అయ్యలరాజు నారాయణమాత్యుని రచనా ప్రజ్ఞాశైలి మరొకరికి లేదు. 'బొకావియో' కథలు ఇలాగే ఉండవచ్చు. మరోదాంట్లో ఇలాగే యుండవచ్చు. కానీ విజ్ఞాన సర్వస్వం లాగా రచన చేసింది లేదు. అందుకే హంస వింశతికి ఆ విశిష్టత. ఇందులో హంస

చెప్పిన కథల్లో ఆయా నాయికల వర్ణనలు అన్నీ స్త్రీవర్ణనలే అయినప్పటికి ఒక దానితో మరొకటి పోలికరాకుండా జాగ్రత్తుగా ఒళ్ళు దగ్గరపెట్టుకొని చేసిన కస రత్తులా అన్పిస్తాయి. అంతేకాదు ఆయా కులాలగురించి చెబుతున్నప్పుడు వారి వారి వేషభాషలు ఎంతో నిశిత పరిశీలన చేసి చెప్పినట్లు కన్పిస్తాయి

విష్ణు దాసుడు విదేశానికి బయలుదేరేటప్పుడు అతడు ఏయే వంటకాలు ఏ ఏ పదార్థాలు తీసుకెళ్ళారో ఒక పట్టిక ఇచ్చాడు. ఇదంతా ఆనాటి సాంఘిక చరిత్ర తెలుసుకోవడానికి ఉపయోగ పడుతుంది. 'బొరుగులు' తీసికెళ్ళాడని చెప్పడంతో మరమరాలు అప్పటికే ఉన్నాయని తెలుస్తుంది. 'దోసెలు' కూడా ఆ పట్టికలో ఉన్నాయి!

హంస ఇంత కథ నడపడానికి కారణం ఉంది. అంత అందగత్తె అయిన భార్యని విడిచి వెళ్తున్నాడు. కాబట్టే విష్ణుదాసుడు హంసతో ఇంటిలో భద్రం అని చెప్పి వెళ్లాడు. అదీ అసలు అంతఃపుర రహస్యం.

వెళ్ళడానికి సింగారించుకున్న అమ్మగారిని నిలేసి నీతులు చెప్పి హితువు తప్పి నడుస్తున్నందుకు హితువు చెప్పి - సీత దమయంతి, శచీదేవి, ద్రౌపది తమపై మోహులైన రావణ పుళింద, నహుష, కీచకుల కోర్కెలను తిరస్కరించారో చెపుతుంది. రాజులు ఎలాంటి వారో వివసిస్తుంది. రాజులు సంగమానికి తగని వారంటుంది.

> అధిపుల్ క్రూర ఫణి స్వరూపు లధరం బాసించు టే రీతి భూ
> మిధవుల్ కాళకరాళ కీలి సదృశుల్ మేన్మేన బొందించు టె
> ట్లు? ధరాధీశులు మత్తదంతి సములేలా నీకు చెర్లాట మా
> డ? ధరాభృత్కుచ యిరైరంగెరిగి వేడ్కం గోర్కు లీడేర్చికో,
> అని చెప్తుంది. ఇందుతో చమత్కారం చూద్దాం.

విషంకక్కే పాములాంటి వారు రాజులు. వాళ్ళ అధరచుంబనం ఆశించొచ్చా? కాటు పడితే విషం ఎక్కదా? వాళ్ళు ప్రళయాగ్ని లాంటి వాళ్ళు. వాళ్ళతో మేనుతో మేను పొందించడం ఎలా సాధ్యం? అగ్నితో పొందు ఆఖరే

కధా ! వాళ్ళు ఏనుగులాంటి వారు - వాళ్ళతో తమాషాలా ? ఇందులో శబ్ద చమత్కారం చూడవలసిందే ?

అలా నిలేసి అడ్డు చెబ్తూ ఉండగానే మొదట రోజు తెల్లారి పోతుంది. రెండో రోజు మళ్ళి మామూలుగా సిద్ధమౌతుంది హేమవతి. అప్పుడు హంస తప్పుచేసిన చిన్నదాని కథను చెబ్తూ ఆలాంటి ధైర్యం ఉందా అని అడుగుతుంది

కధాగనునంగా రెండో కథలో 64 విద్యలు ఏవో వివరించాడు కవి షోడశ కర్మలు చెప్పాడు - షోడశ మహారాజుల పట్టీ ఇచ్చాడు కథలో ఇతరుల సొమ్ము కాశించి ఎలా చెడింది చెబుతుంది హంస. మళ్ళి తెల్లార్తుంది. హేమావతి ఆగుతుంది. మళ్లి మూడో రోజు కథ మామూలే. అందులో కథా నాయకుడు వీరుడు. అతని భార్య అతని కులభామ గుణధామ, అలఘుకామ, అతులితారామ అసమ రూపాభిరామ వదనజిత సోమ అధిక లావణ్య హేమరేఖ, ఆమె బిడ్డ పాపల కన్పెంచు జిడ్డులేక తిండిచే గండ మెండైన దండి కతన నెసగు నసగూటి పిస వెర్రి కటుసరేగి జారావాంఛా విహారం చేయసాగింది. ఆమె విటులకు కొంగు బంగారం. వేడుక కాంద్రకు పట్టు గొమ్మ. విట భాగ్యరేఖగా ఉన్న హేమరేఖ, ఓ వైద్యుడితో సంగతి చేస్తుంది. అక్కడ వైద్య పరిశ్రమ పట్టికిచ్చాడు కవి. ఆమె పిలిస్తే "పరోపకారిరా ఈ కలకంఠి" అనుకొని సై అంటాడు. ఇద్దరూ సై అనుకునే సమయంలో బయటకు వెళ్ళిన భర్త వస్తాడు. హేమరేఖ అబద్ధపు కడుపు నొప్పి దానికి వైద్యం చెప్పి రక్షించాడని బొంకుతుంది. అతడు నమ్మి వైద్యుడ్ని 'బహుమానం' ఇచ్చి సమ్మానిస్తాడు. అదిగో ఆ హేమరేఖ ధైర్యం ఉందా అని అడుగుతుంది హంస. అంతలో తెల్లార్తుంది.

ఇలా ఇరవయి రోజులు గడిచిపోతాయి. అడుగడుగునా అద్భుతవర్ణనలు విజ్ఞాన సర్వస్వంలా మృగాల, పక్షుల, బాలక్రీడల, బాలికాక్రీడల, కోళ్ళ, గొర్రెమేకల పర్వతాల, ముళ్ళ, కంపల, ద్వీపాల పట్టీ వరుసపెట్టి ఇచ్చారు.

అవే కాక పండ్లురకాలు, పంటలు కూరగాయలు, పుణ్యక్షేత్రాలు మహానదులు ఒకట మిటి ఎక్కడ ఏసందర్భంలో ఏది అవసరమో అపట్టీ ఇచ్చాడు.

ఎప్పుడో శృంగార గ్రంథమండలి వారిచే అచ్చైన ఈ గ్రంథాన్ని వెదికి పాఠదోష దోష పరిష్కరణ చేసి అర్ధతాత్పర్యాలు రాసి సిద్ధంచేశారు మా గురువర్యులు శ్రీ మద్దుపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దానిని 64 లో అచ్చేశారువావిళ్ళవారు. మళ్ళీ తెలుగు అకాడమి కూడా అచ్చేసింది.

ప్రౌఢ కల్పనతో లోకజ్ఞానం చెబుతూ నీతిని బోధించేది ఈ శృంగార ప్రబంధం. అన్నట్టు ఇది బూతు పుస్తకమని అప్పటి బ్రిటీష్ ప్రభుత్వము (1871) నిషేధించింది. తిరిగి ప్రకాశం పంతులు గారి కాలంలో ఆ ఉత్తర్వులు పోయాయి.

సాహితీ పిపాసువుల దప్పిక తీర్చే ఈ కావ్యం పరిష్కరించిన మద్దుల పల్లి వారి ఋణం ఎప్పుడూ తీర్చలేనిది.

# అందని ద్రాక్ష "చూపులు"

ముదురాకు రాలేటి ముదిమినాళులలోన తొడిగేటి చివురాకు పడుచు పొద్దులలోన ఆకునైన కానుగా—

అయినచో

సోకేది చిరుగాలి నన్ను

మెల్లతాకేవి మిణిగురుల హొన్ను

మొగిలు కన్నెల గుంపు ధగధగ మని మెరిసేటి చిగురు వెన్నెల కావి సొనిసు సంజెలలోన మొగిలునైనా కానుగా—

అయినచో

ఎగిరిఉందును మింట కొనల

మెల్ల తగిలి యుందును వెల్గు సొనల తొలి ప్రేమ రుచిచూచు నెల ప్రాయపుంగన్నె తలిరు మెత్తని నీలవలపులో ఊహనైనా కానుకగా

అయినచో

వలచేది నను చిన్న చూపు

మెల్లకలచేది చివురాకు తూపు

ఇది సుమారు 60 ఏళ్ల క్రితం 1926 లో విశ్వనాథ వ్రాసిన చిన్న తలపు అనే గేయం మెత్తమెత్తని మాటలతో పరమ సుకుమారమైన భావనలతో గేయాలు అల్లారు విశ్వనాథ కిన్నెరసాని పాటలు కోకిలమ్మ పెళ్ళి ఆ కోవలోనివే. ఎన్నో ఖండికలున్నాయి. ఎన్నో ముక్తకాలున్నాయి. పంచవింశతి అనే సంకలనంలో విశ్వనాథ వారి చమత్కారం కవితా ధోరణి ఎంత గొప్పగా ఉంటాయో చూడొచ్చు.

యామినీ సరస్వతి

ఆకాశంలో తెల్లమబ్బు అనే గేయం 1926 లో సాహితిలో

అచ్చైయింది.

నీవు నేను కూడి

నింగి లోనికి పోయి

నీలిమబ్బుల తేలి

చందమామను చూసి చానా ! నవ్వామె

చందమామా నవ్వె చానా నను చూచి

చందమామా నవ్వె చానా నిను చూచి

తిరిగి రాబోయామె

తెరవ నీవంతలో

తెల్ల మబ్బయ్యావే

చల్లనైనా వొలు జానా ! నవ్వానె (చందమామా)

అంతలోనే చూడ ఆకాశమైనావే

ఆకాశమున వ బ్బువై నీవు తేలుచూ

చందమామను చూచి చానా నవ్వామే

ఇలాంటి గేయాలే కాదు మెత్తని పద్యాలు రాశారు.

కల్ప వృక్షంలో అరణ్య కాండలో - సీతను ఎత్తు కెడుతూ

రావణు డుంటాడు

ఐపాన వాలు తెలియని

నా పోయిన తెన్ను తెలియునా తనికిన్

వాపోయిన వాపోతలు

ఏ పుట్టం పుట్టబోవు నితని కథాళల్

ఐపు అనవాలు తెలియికుండా పోతున్న నాదారి అతనికి తెలుస్తుందా ! నీవు తప్పి పోయావని అతను వాపోయె వాపోతాలు - ఏడ్పులు - ఏ పుట్టలో కథలుగా పుడతాయో ! అంటాడు. ఎంత గొప్ప చమత్కారం ఉందో మనసుకే తెలుస్తుంది.

ఆయనకి మనమన్నా మన భాషన్నా, మన సంస్కృతి అన్నా పట్టా పగ్గాలు లేని భావావేశం పుట్టుకొస్తుంది. ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ అన్న అప్పయ్య దీక్షితులలాగే -

బహుజన్మ కృత పుణ్య పరిపాకమున జేసి
ఆంధ్రుడై ధాత్రిలో నవతరించు
బహుజన్మ కృతపుణ్య పరిపాకమున జేసి
ఆంధ్రభాషను మాటలాడు చుండు
బహుజన్మ కృతపుణ్య పరిపాకమున జేసి
ఆంధ్రత్వమన నిద్దియని యెరుంగు
బహు జన్మ కృత పుణ్య పరిపాకమున జేసి
ఆంధ్రీ మహామూర్తి నైక్యమొందు

వట్టి నడమంతరపు సిరి వట్టినట్టి
బాసలంగని మతి భ్రాంతి పడకు మోయి
ఆంధ్రుడని నంత నాత్మతత్త్వ
మఖిలము నెరుఁగుటన్నది యంచు తెలియు

అంత రసావేశం గానే చెప్పిన ఆంధ్ర పౌరుషం చదివేందుకు కాస్తంత తీరిక, అర్థ సుకొనే ఓపిక ఉంటే క్రమ క్రమంగా కిన్నెరసాని పాటలతో శశి దూతం ప్రారంభించి కల్ప వృక్షం దాకా సాగిపోవచ్చు.

అమృతం గూడుగట్టిన దొరలాంటి మధుర కవిత్వమును ఆస్వాదించ వచ్చును. కావ్యరూపమైన విశ్వనాథ శారదనే కాక నవలా రూపంగా అంతరాత్మ అయి ఏకవీరగా రూపుదిద్దుకొని చెలియలి కట్టను దాటుకొని వేయి పడగలుగా విస్తరిల్లిన విష్ణు శర్మ ఇంగ్లీషు చదువు పురాణ వైర గ్రంథాలు దాకా ఎలా మ్రోయు తుమ్మెదగా ప్రతిధ్వనించిందో చూడవచ్చు. స్వర్గానికి నిచ్చెనలు వేయ వచ్చు కానీ - లోకంలో అందని ద్రాక్ష పళ్ళు పుల్లన అని ఓ సామెత ఉంది. మనకు అందుబాటులో లేనిది అందుకోడానికి మన శక్తి చాలక అది ఒప్పుకోవడం ష్టంలేక ఆ వస్తువునే కించపరచడం బతక నేర్చిన వాళ్ళ రీతి. ఆ ధోరణిని చూపేది ఈ సామెత.

కవిత్వం ఆస్వాదించడానికి పాండిత్యం కంటే ముఖ్యమైంది రసవంత మయిన మనస్సు. అది లేక పోవడం వలన జీవివంతమయిన కవిత్వం అదృశ్య

మౌతూనే ఉంది. ప్రభుత్వం అంతరించి పోయే అరుదైన జంతు జాలాన్ని పక్షి సంతతిని జాతికోసం అంటూ జూలో ఉంచి కాపాడుతుంది. కాని జాతి చైతన్యానికి మూల భూతమైన కవిత్వ తత్వాన్ని రక్షించే కవుల్ని పండితుల్ని వారి రచనల్ని గురించి పట్టించు కోడం లేదు.

విశ్వనాథ సత్యనారాయణగారు ఒకచోట అంటారు

తొలి నాళుల పద్యార్థము
తెలియనిచో పాఠకునిది తెలియమి ఈనా
ళుల వ్రాసిన కవి దోషము
కలి ముదిరిన కొలది చిత్రగతులన్ నడుచున్

అలా ఐపోయింది పరిస్థితి. విశ్వనాథ వారిది పరమ సుకుమారమైన శైలి. ఆయన్ని చదవ లేక పాషాణ పాకం అనడం పైన చెప్పిన లాటిదే.

# కౌగిలి నొప్పులు కవీంద్రుని మెప్పులు

అది ఇంకా రసికత చావని కాలం. శృంగారమంటే మనసుకి తనువుకి ఆరోగ్యాన్నిచ్చే సింగారంగా భావించే మంచి కాలం. అనుభవాలు తప్పుకావు కానీ తప్పుడు అనుభవాలు ముప్పు అని తెలుసుకున్న మేలికాలం. మనిషిలోని కామ ప్రవృత్తిని రాక్షసగుణాన్ని రెచ్చగొట్టే రచనలు లేని చక్కని కాలం. వర్ణన పేరుతో మనిషిలోని పైశాచికత్వానికి ప్రాణం పోయకుండా మనసువీణని మధురంగా శృతి చేసి అందమైన రాగాలను పలికించిన చక్కని కవుల కాలం.

పిఠాపురం రాజావారు కవితను పోషించారు కవులను పోషించారు. కృతి చెప్పి అంకితం ఇచ్చి ఆ మీదట తృప్తితో సంతృప్తితో కాలం గడపే వాళ్ళు కవులు. నిద్దుర్లేవగానే నిత్యం జీవన భృతికి వెంపర్లాడాల్సిన గతి కవులకి కళాకారులకి ఉండేదికాదు. అందుచేత చక్కని వర్ణనలతో ఎంచక్కనైన కవిత్వాన్ని అందించే వారు. ఆ పిఠాపురానికి సమీపంలో చంద్రపాలెం అనే ఊరుంది. ఆ ఊళ్లో కూచి మంచి వారిది పండిత కుటుంబం. బాగా చదువుకో గలిగే కావ్యాలకి వాళ్ళ ఇల్లు పుట్టిల్లు, అన్న తిమ్మకవి. తమ్ముడు జగ్గకవి. ఇద్దరూ కవిత్వంలో ఉద్దండులే ! తిమ్మకవి తేనెతేటల్లా పూట నీటిలాగా మాటల మూటలు పేర్చి రసికజన మనోభిరామం వ్రాశారు. అది దేశవ్యాప్తంగా పఠన పాఠంగా ప్రచారంగా రూపొందింది.

ఆ నోటా ఆ నోటాపడి అందులో కవితా సోయగాలు ఇంపైన వర్ణనలు పసందైన భావనలు ఓవేశ్య చెవిన బడ్డాయి. ఆరోజుల్లో వేశ్యలు తరసకి వెలయాళ్లైగానీచదువుకుని భరత నాట్యాది విద్యలు అభ్యాసం చేసి వీణ మొదలైన సంగీత వాద్యాలు నేర్చి ఇంటికి వచ్చిన సరసుడైన విటుడిని ముందు మాటతో పాటతో ఆటతో బాగా సంతోషపరిచి ఆ తరువాత శారీరకానందాన్ని పంచుకునేవారు. వచ్చే విటుడైనామనస్సు శాంతపడ్డాకే తనువు శాంతపడాలని కోరేవాడు.

విద్వజ్జన రంజని అనే వెలయాలికి అవి విన్నాక ఆ గ్రంథం చదవాలనిపించి తెప్పించి చదివాక ఇంత బాగా శృంగార రసపోషణ చేసిన కవిగారు ఎంతరసికులో ఎంత అందగాడో అనుకొని ఆ కవిగార్ని చూడాలని బయలుదేరింది పిఠాపురం దాటి చంద్రపాలెం చేరుకుంది.

ఈమె వెళ్లేసరికి ఆ కవిగారు ఎలాఉన్నారు ? మధ్యాహ్నం దేవ లార్చన చేసి ఆ మీదట కునుకు తీసి భోజనానికి అవసరమైన విస్తళ్లు కుట్టుకుంటు న్నారు.

మధ్యాహ్నం భోజనవేళ కట్టుకున్న మడిపంచె— రోజూ తడిపి పిండి ఆరవేయడంవల్ల ధోవతి తెలుపుపోయి నీరు కావి రంగుకి వచ్చింది. మోకాళ్ళ పైకి జరిపి ఎగదీసి కట్టుకున్నాడు. మొఖాన గంధాక్షతలు. మాసిన గడ్డంతో ఒకటి అరా నెరసిన వెంట్రుకలు పిలకముడి, భుజాల మీద షష్టిపంచ !

ఆ రూపంలో అతన్నలా చూడగానే రంజని మనస్సు నీరు గారి పోయింది. "ఏం బాపనయ్యవయ్యా ! కవి సార్వభౌముడివని బిరుదు ఉన్నం దుకైనా కాస్తా హోంబట్టు పంచె సింగారించి భుజాన కాశ్మీరు శాలువా వల్లెవాటుగా వేసుకొని ముఖాన శ్రీ చందనం దిద్దుకుంటూ తాంబూలం సేవిస్తూ సత్కవితా గోష్ఠిలో ఉంటావనుకుంటే విస్తళ్ళు ట్టుకుంటున్నావా అనుకుంది.

అయినా తమాయించుకొని సమస్కరించింది.

"కవిరాజులకు నమస్కారం !"

"శుభమస్తు ! శోభనమస్తు ! దీవించాడు తిమ్మన

"మిమ్మల్ని చూడాలని వచ్చాను"

"వచ్చి చూశావుగా !"

'మీరసిక జనమనోభిరామం—'

'చదివావా ;'

"ఆహా ఏం పద్యం....ఏం వర్ణన"

అంటూ నాల్గైదు పద్యాలు పరవశంతో ఆందులోనివి చదివింది. ఈ లోగా కవిగారు విస్తరాకులు, అంటువేసే పుల్లలు, కుట్టిన విస్తళ్ళు వదిలేసి నుంచున్నారు. నడుం మీద చేయ్యేసి వింటున్నారు.

అబ్బురపడి చదివిన కవిత్వం మనసు తబ్బిబ్బయ్యే పరవశత్వం ఎదురుగా ఆజానుబాహువు - అందగాడు అయిన కవి సార్వభౌముడు - భుజాన కాశ్మీరు శాలువా బదులు గావంచ వుంటేనేం ? పట్టు పీతాంబరానికి బదులుగా పాత నీర్కావి పంచె అయితేనేం ? ముఖాన కస్తూరి తిలకం బదులు గంధాక్షతలుంటేనేం ? మెడలో రత్న హారాల బదులు జంధ్యప్పోగుంటే ఏం ? ఆ నాటి వరూధుని ప్రవరుడ్ని చూచి ముచ్చట పడినట్లుగా ముచ్చట పడిపోయి ఆగలేక కవిరాజును కౌగిలించుకుంది.

వచ్చినప్పటి నుంచి చూస్తున్నాడు వాలకం. కాస్తంత వెర్రి యింకా స్తంత పైత్యం వున్నట్టు అర్థం అవనే అయ్యింది. ఇదిగో ఇప్పుడు కౌగిలింత—

చప్పున ముఖం తిప్పుకున్నాడు. కవి సార్వభౌముడు. ఊసురుమ నింది రంజిని ఊసురు మన్న మనస్సు కస్సుమంది. కవిత్వంగా చతురులలోన నెంతయును జాణసటంచును, నెంతయును నేను గౌగిలించితి, ఇటు మారుమో మిడగ చెల్లునెయో రసికాగ్రగణ్య !"

ఏమయ్యా కవీ ! రసికుడవే ! జాణవే ! చతురులలో చతురుడవని పేరుపొందావే ! నే వచ్చి మెచ్చి యిచ్చిన కౌగిలికి నొచ్చినట్లుగా పెడమొఖం పెడతావేం ? అంది పద్యం అయ్యాక గద్యంలో.

ముసి ముసి నవ్వులు నవ్వాడు తిమ్మ కవీంద్రుడు !

అయ్యో పాపం ! వరూధినిలాగే మొఖం వేలాడేశావ్ ! ఇంతకింతకు నచ్చి వచ్చినందుకు మెచ్చి కౌగిట్లో గుచ్చినందుకు మారు మొఖమయ్యానని కోపమా ? ఇంతకు నేను అటుమొగమయ్యింది ఎందుకో తెలుసా ?

"అద్భుత మగునట్టి బంగరపు బొంగరపుంగవబోలు నీ కుచద్వితయము బొమ్మన నాటి వీపున దూసె నటంచు చూచితిన్."

"బాలా ! బేలవు కావద్దు ! బంగారు రంగారు బొంగరాల్లా అన్ని విధాలా అందగా ఉన్న నీ చనుదోయి బిరుసెక్కి పదునెక్కి నిక్కినాగుండెను దూసుకొని వెళ్ళాయి. అయినా అంతటితో ఆగకుండా వీపుగుండా వెళ్ళుకుని వచ్చాయేమోనని ఆ గుచ్చుకున్న వైఖరికి అదిరిపోయి వెనుదిరిగి చూశాను అన్నాడు.

అంతే !

"భళిరా సత్కవి సార్వభౌమ ! కూచి మంచి తిమ్మ ! నిజంగా జాణవే!" అంటూ సిగ్గులమొగ్గ అయ్యింది రంజని.

# 'చిక్కని' అందాల విలాసం

అర్జునా ! పరాక్రమోపార్జునా ! విందువా నా మాట ! ఈ గదుడు అంగదుడులా చెప్పే రాయబారం వింటావా ! ఎన్నిదేశాలు చూశాం ! ఎంద రమ్మాయిలను చూశాం. ఎక్కడా అలాంటి అందగత్తె లేదయ్యా అర్జునా !

ఆమె కోప్పుతో పోల్చడానికి తగిన మాటలే లేవు. పోలికలే కానరావు ఎప్పుడు కేశికా సరసిలో తేలి ఆడుతూ అంటాయి. కాబట్టి శైవాల లతలు కొంత సాటి వస్తాయి. పుష్పమాలికలతో పొందు సల్పుతాయి కాబట్టి ఎలదేటిగుంపు కొంత యీడౌతాయి. కంటికింపగు రేఖగా ఉంటుంది కాబట్టి కాటుక దినుసుగా కొంత పోలుతుంది ! వయ్యారంలో బిరుదు పొందింది కాబట్టి చమరివాలం కొంత సమయం కావచ్చు. అంతే కాని ఆమె సోగవెంట్రుకలకు ఏవీ సరిరావు. ఆనలుపు ఆమెత్తని మొత్తం - ఆనిడుద - ఆదళాలు ఆ మెరపు ఆహో ! నుతింప శక్యం కాదు....

అన్నట్టు నీగురించీ చెప్పాలే ! జయంతుని తమ్ముడు సోయగంలో అన్నాను. శ్రీ కృష్ణుని ప్రాణసఖుడని చెప్పాను ! పోరులో పరమేశ్వరుడివ న్నాను— ఇంతెందుకు ? అతని కతనే సాటి చతురబ్ధి పరీత మహీతలంలో అన్నానయ్యా !

అందమే కాదులే - ఐశ్వర్యమే కాదులే శౌర్యాన్ని కూడా గొప్పగా చెప్పాను లేవయ్యా మిత్రమా! మా అర్జునుడు పారచూస్తే పర సేన పారజాస్తుంది ! వింటికి ఒరిగితే రిపురాజి వింట కొరుగుతుంది. వెయ్యేటికిమా మా పాండవేయు సాటి వీరుడిల లేడమ్మ ! ఉంటే గింటే ప్రతి రఘువీరుడు ఒకడే అన్నానయ్యా !

అర్జునా నీకతలేమిటి ? ఆమెవర్ణన వినవయ్యా ! ఒక్కొక్కరికి నడుమంత్రపు సిరివస్తే నిక్కినీల్గి విర్రవీగుతారు కదా ! ఆమె కుచాలు మెరుగు

టూరు వేనలి అలాగే నిక్కినీల్గాయి. కుచాలకు పర్వత సాదృశ్యం వచ్చింది. దానితో నిక్కాయి చక్కా! ఏంపొగరు! ఎంత పొగరు అన్నట్టున్నాయి. మిత్రమా! మెరుగుటూరు అహీనభూతితో నీలిగాయి. ఇక వేనలి ఘనాభ్యుదయం పొంది మేఘ మాలికల్ని తలదన్నుతూ విర్రవీగుతూ ఉందయ్యా! నిజమే కదా మొదట లేనిసిరి నడుమంత్రగా వస్తే నిక్కి నీల్గవా మరి?

నవీనవయో విలాసాలతో నడక అంచలను బుజ్జగిస్తే- చనుకట్టు రథాంగ యుగళిని మచ్చిక చేస్తే! ఆమె చెలువపు పలుకులను చిలుకలు గారవిస్తే-కనుదోయి చకోరపాళిని పెనగి అందగిస్తాయి. అంతందం అంత సొరుతీరు ఏమందం. మందయాన ముఖ మందం నవారవిందం మిరుతుంది.

ఆమె అందం జగాదివిటీలు పెట్టినట్లు జగమెరుంగు! అర్జునా! కాబోయే ప్రేయసి అందం కన్నులకు కట్టినట్టు వర్ణిస్తూ ఉంటే ఇంపుగా ఉంది కదా? ఇంకా ఇంపారేలా వినిపిస్తాను! ఆమె పీనులు తొమ్మిదిని అదేమి లెక్క అని లెక్క చేయవయ్యా! ఎందుకా? తొమ్మిది రాస్తే ఏర్పడేది. తనకేమో రెండు చెవులు, శ్రీకారం దిద్దే తొమ్మిదిలా ఉన్నాయి. ఆమె చేతి గోళ్ళను క్కటంటాయి. చక్కని చుక్కల్ని! ఆమె గబ్బి గుబ్బలు పువ్వుల చెండ్లను పోపో అంటాయి. ఆమె ముఖారవిందం ఆ చందమామను త్రోసి రాజంటుంది. పాపం రాజైన చంద్రుడు కిమ్మలేదు.

అయ్యారే! ఆ చెలువం ఎక్కడయా! వెయ్యారు స్త్రీలలో - ఆరు వేల - పదారువేల భామల్లో వెదికినా ఆ అంగ రుచి రుచిరాంగ రుచికి ఈడు జోడు ఉందా! రతీదేవిని ఊఁ అని త్రోసివేయగల తీరు తెన్నులున్నాయి సుమా

పార్థా! ఆమె కొప్పు కడు హెచ్చు! ఎందుకా నలుపులో సొరులో తీరులో బారులో అదే హెచ్చు! ఆదే హెచ్చనుకుంటే వక్షోజాలు మరీహెచ్చు! ఇక కటి వీటన్నిటి కన్నా హెచ్చు! అదీ ఇదీ అనడం ఎందుకు? అన్నీ హెచ్చే! మరి పస లేనిదే లేదా అంటావా! పాపం నడుం మాత్రం పసలేదు. కడు పెద్ద పిడికిటబిగిస్తే పిడికిలే మిగిలిపోతుందేమో అన్నంత సన్నం.

ఓ నృపపుంగవా! ఇంకేం చెప్పగలను ఆమె శరీరం బంగారం! ఆమె నొసలు (కొన్నెల వంక, ముంగుర్లు ఇంద్ర నీలాలు, అన్నట్లు నీవు ఇంద్ర

సుతుడివే కదా! సరి పోతావులే. అయితే ఆమె చూపులున్నాయి చూడు మన్మథుడి రెండు డాళ్ళవలె ఉంటాయి· ఇంతెందుకు. ఎక్కడ నెప్పినాడ· తరలేక్షణ చక్కదనమ్ము ఇంక అమ్మక్క! అచే మనంగ ఇపుడందు శతాంశము తెల్పలేదు. ఒక్కొక యంగమెంచ వలయున్ పదివేల ముఖంబు లాయెపో చొక్కపు చూపులో పొల్చు చూచిన కాక ఎరుంగ వచ్చునే !

అలా భట్టులా పొగిడాడు గదుడు విన్నాడు అర్జునుడు. విలాస యాత్రకు బయల్దేడు. ఆపై – అబ్బ ఎంత కథ.

ప్రతి పద్యమునందు చమత్కృతి కలుగంగ చెప్ప నేర్చిన చేమకూర వెంకట కవి మాటల నేర్పులా సరస మార్గములా కొలువుండు రీతులా పాటల గంధులా కళల భాగ్యములా బహుదాన లీలలా! నాటక శాలలా! యొకటనన్వలదు ఎన్నిట చూడ అన్నిట మేటియు గీర్తి లోలుడు అయిన రఘునాధ రాయల వారికి తారస పుష్టియై ప్రతి పదంతో జాతి వార్త చమత్కార అర్థ గౌరవాలు కల్గేలా రచించిన రాయలవారికి చెవిసోక చెప్పిన కమనీయ కావ్యం విజయ విలాసం.

ఆనతి ఇచ్చెనా అది శిలాక్షరం. ఎవ్వనేని మెచ్చెనా వాని కృతార్థు చేస్తాడు. ఇచ్చాడా అది ఏనుగు పాడి అని రఘునాధుడ్ని పొగిడినట్లే ఈ గ్రంథంలో పదాలా పద్యాలా భావాలా చమత్కారాలా మాట విరుపులా ఉపమల అబ్బా ! ఎన్ని! ఎన్నెన్ని! తాపీ ధర్మారావ్‌గారి హృదయోల్లా సందర్గరుంచుకొని చదివితే తప్ప తనివి తీరుతుందా ! అప్పుడు కదా అనుకోవడం! 'దొరకునా ఇటు వంటి కవనం'

—౦—

సరస్వతీ మహల్

# మరో 'విజయ విలాసం'

వాలు మీలు డాలు నేలింతి కన్గవ

సోము గోము నోము రాము మోము

మించు మించు సంచు మించు బాలిక

మిన్ను చెన్ను తన్ను కన్నె నడుము....

ఈ పద్యం వినిపిస్తే - ప్రబంధ కవిత్వంతో అంతో ఇంతో పరిచయ్న ఉన్నవాళ్ళు చప్పున ఇది 'విజయ విలాసం' పద్యమనేస్తారు.

నిజానికి ఇది విజయ విలాసంలోని పద్యమే అయితే 'చేమకూర' విజయ విలాసం కాదు. గణపవరపు వేంకట కవి 'ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసం' —

ప్రబంధాల్లో ఆశుచిత్ర విస్తర వర్ణన అనే చిత్ర కవిత్వం ఎక్కడో ఒకచోట చెప్పడం మన ప్రబంధ కవుల నియమం. కానీ అంతా చిత్ర కవిత్వమే చెప్పిన ఏకైక ప్రబంధం "ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసం" ఎక్కడో ఒకచోట అలాటి పద్యం వుంటేనే దాన్ని ప్రతిపదార్థంగా వివరిస్తే తప్ప సులువుగా అర్థం కాదు. అలాంటిది గ్రంధానికి గ్రంథమే మొత్తం అలావుంటే ఇక చెప్పేదేముంది.

మీలు అంటే మీనులు - వాలు మీలు అంటే వాలు కన్నులున్న చేపలు ఆడవాళ్ళను మీన నేత్రలు అంటారు. చేప ఆకారంలో వుండి జింక కళ్ళలా - చేపకదలికతో మెరిసే విరిసే కనులున్న అమ్మాయిని మీన నేత్ర అంటారు. ఆ ఇంతి కనుగవ - రెండు కళ్ళు - వాలు కనుల చేప డాలు = అందాన్ని ఏలుతుందట - అంటే చేప కనులతో పోలిక కాదు - దాన్ని మించి వున్నాయనీ అర్థం —

సోము అంటే చంద్రునియొక్క - గోము అంటే అంద చందాలు ఓమడమంటే జయించడం రామ అంటే అందగత్తె ఆ అందగత్తె ముఖ చంద్రుడు చంద్రుని అందచందాలను జయించేలా వున్నారట—

మించు అంటే మెరుపు తీగె మించు మించు అంటే ఆ మెరుపుల్లో మెరిసే మెరుపు. దాని సంచు అంటే అందము. ఆ బాలిక మేను. మెరుపు తీగల్లో మెరుపు తీగ అందాన్ని మించుతుందట - ఆడవాళ్ళ శరీరాన్ని మెరుపు తీగతో పోల్చడం కవి సమయం. అయితే ఈ బాలిక శరీరం మెరపు తీగల్లో మెరుపు తీగ అందాన్ని మించి పోతున్నదట.

మిన్ను అంటే ఆకాశం. ఆకాశం గగనం శూన్యం అని ... అది ప్రోది చేసుకుని ఆకాశం అంటే శూన్యం అని అర్థాన్ని లాగారు. చెన్ను అంటే అందం. నడుమును గగనంతో పోలుస్తారు. ఆకాశం కంటికి కన్పిస్తుంది. కానీ నిజానికి అది శూన్యం లేదు. కాబట్టి ఉండీ లేనట్టు, లేనట్టుండే లేలేత నడుమును గగనంతో ఉపమించడం కవి సంప్రదాయం. అయితే ఈ కన్నె నడుము ఆ ఆకాశం ఉనికినే ప్రశ్నిస్తోన్నట్టుగా వుందట —

ఒక తేలిక పద్యంలోనే ఇంత కసరత్తు చూపిస్తే కొంచెం కఠినమైన పద్యంలో ఎలా మీతి మిరేడొ చుద్దాం.

నిను నెమ్మనమున నమ్మిన
ననుమానము మానమాననని నేమమునన్

మనసీ నామము నూనెన్నను
మానిక నిన్ను మాననానేమేనా

ఇది నిఘంటువును దగ్గర పెట్టుకొని చీల్చి చెండాడితే కానీ అర్థం దొరకని పద్యం. దీని తాత పద్యం మరొకటి....

లోలాశీ లాలి లీలా శిలా లీ లాల లేల లేలిలు లులులే
లోలులై లాలలల ల్లీ లైలల లాలలోల లేలో లేలా....

ఇవన్నీ పండిత ప్రకాండులు వలచి ఒలచి చేతిలో పెడితే మనం "తాపీగా" ఆస్వాదించదగ్గ ఇనుపగుగ్గిళ్ళు— ఊపల నారికేళాలు. మన్నించండి నాళికేరాలు—

విజయ విలాసం అన్నందుకు— అలాంటి పద్యాలు
పరిపదము బోలుజవరాలి గౌనుకౌను
మిక్కుటద్దములను గొమరెక్కు చెక్కు చెక్కు
గులుకు దేటుల కింతి ముంగురులు గురులు
గరిమ నెలకన్న కన్నె జఘనము ఘనము

ఇలా శబ్దాశ్రయ శ్లేషచమత్కారం కొంచెమే నిజానికి ఇందులో పాండితీప్రౌఢిమ అంతా ఛందస్సంభంది. ఇదొక చిత్ర బంధ కవిత్వ సరసి.

బంధ కవిత్వంలో గోమూత్రికా బంధంలాటిని చాలా మంది కవులు చేసిన చిత్రాలే— అలాగే ఒక పద్యంలో రెండో మూడో పద్యాలు లాగడం కూడా చాలా మంది చేసిన పరిశ్రమే. అయితే ఇందులో ఒక సీసంలో 41 వృత్తాలు ఇమడ్చడం— నభూతో నభవిష్యతి అనేలా చేసింది మాత్రం గణప వరం వేంకట కవే ! (808) పద్యం) పద్యాలకు కందమనో సీసమనో చంపక మాలనో పేరుంటుంది. ఉదా— శ్లోకగర్భిత చంపకమాలిక— అంటే చంపక మాల పద్యంలో శ్లోకం వుంటుంది (822)—అయితే 41 వృత్తాలను ఇముడ్చు కున్న ఆ పద్యం పేరే ఒక పెద్ద వచనంలా వుంటుంది—

ఇలాటి కఠిన క్రీడలే కాక 'తేలికయిన ఆటలు" కూడా పద్యాలతో ఆడుకున్నాడు వేంకట కవి— సంవత్సర యుక్త సీసంలో శ్రీముఖి ప్రభవ— సౌమ్య — భావ మొదలయిన సంవత్సరాల పేర్లతో పద్యం కట్టాడు కవి (389) — సర్వలఘువచనం (383)తో పాటు, సర్వగురువచనం. కూడా వుంది (447) అచ్చ తెనుగు పచ్చలూ ఇందులో పొదిగి పోషించాడు కవి.

ఇలాటి కారచమత్కారాలేకాదు చక్కని కవిత్వం కూడా చెప్పాడు కవి.

ఏటికి నన్నెదుర్కొన వదేటికి కౌగిటగ్రుచ్చి చేరవిం
తేటికి విన్న నయ్యెద వదేటికి చూచెదుటిత్తచూపులన్
మాటిలి వెందు రీకులుకు మాటలు నీనగుమోము తేటలో
పాటలో పాటలాధర కృపన్ గనుమా యనుమాన మేటికిన్

ఒక కవి ఆజీవితం కృషి చేస్తేనే ఇలాటి ప్రబంధాన్ని సృష్టించగలడు. అలాంటి గ్రంథాన్ని పఠించా లంటే ఎంతో తీరిక ఓపిక అవసరం. ముద్రణ పుణ్యం కట్టుకున్నది ఆంధ్రప్రదేశ్ సాహిత అకాడమి. ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయం పనిగట్టుకుని పూనుకుంటే ఎవ్వరైనా "తాపీ"గా కృషిచేస్తే ఈ 'విజయ విలాసం' కూడా ఆంధ్రావళి ఆమోదం' పడయగలదు. ఎవరో ఆ పుణ్యాత్ములు ? ఎప్పుడో ఆ బంగారు కాలం ?

# వెన్నెల్లో గంగమ్మ

అంతరిక్షం నుండి ధారగా కురుస్తోంది వెన్నెల. ఆ నెల నిండిన నాటి వెన్నెల పుచ్చ పువ్వులా వుంది. అచ్చ తెనుగులా వుంది. పచ్చి తేనెలావుంది ఆ వన్నెల్లో - ఆమాఘ మాసంలో పున్నమివాడు - తొలి జాము దాటిన అరున్నొక గడియకు జొన్న చేల వైపు బయలుదేరాడు. శివుడు. తెల్లని ధోవతి- దాని మీద మరింత తెల్లని చొక్కా - భుజంమీద చలవ చేసిన పొందూరు ఖద్దరుపై పంచె - లోకాన్ని చీకాకు పరిచే మన్మధుడు సంధించిన మల్లెపూల బాణంలా వున్నాడు శివుడు.

శివుడి చిత్తమంతా ఆ చిన్న 'దాని మీదే' వుంది. నిన్న రాత్రి-నిన్న రాత్రి జొన్న చేని కావలికి వెళుతూ రాంభద్ర రాజుగారి చేలో - మంచె మీద ఆ మంచు వన్నెల చిన్నదాన్ని చూసినప్పటి నుంచీ అదో విధంగా వున్నాడు ఉదయం మధ్యాహ్నమై, మధ్యాహ్నం సాయంకాలమై, సాయం రాత్రయ్యే దాకా అతని గుండెల్లో కుదురేసుక్కూర్చుంది ఆ చిన్నది —

ఊరి చివర మాధవ స్వామి దేవళం. సత్యభామా సమేతుడయిన సామికి విరహం వియోగ విరహం ఏమీ తెలియనట్టే వున్నాడు. శయనింపు భోగమై పోతూవుంది.

ఊయాల్లో వేసి వూపుతూ పాడుతున్నాడు తంబళి సుబ్బయ్య

ఎంత పేదవాడే - వేణు గోపాలుడెంత పేదవాడే

అంత పేద గాకుంటే అలనాడు కుచేలుని అటుకులకు చేసాచునా - ఓ చెలులారా ఎంత.... కర్ణ పర్వంగా వుంది ఆ పాట.

అదయ్యాక చేతులు జోడించి మనసారా నమస్కారం చేసి "జొన్న చేనికి పోయి సొగసు కత్తెను చూస్తి నిన్నటాలనుండి నిద్రలేదు దాన్ని గూర్చి

దయచూడు మాధవా పొగడపూల దండపూజ చేతు" అని మొక్కుకున్నాడు శివుడు.... ఆరాధ్యుల వారి ఆఖరబ్బాయి ఊరు దాటాడు.

అడుగుతీసి అడుగు వేస్తూ వుంటే అది తన గుండె మీదె వేస్తున్న ట్టుంది. ఉద్వేగం క్షణ క్షణానకి పెరుగుతోంది. తోపు దాటాడు ఏరు దాటాడు. తోట దాటాడు వక్కలేరు దాటాకా అన్నీ జొన్న చేలే. కంకి విడిచిన జొన్న చూలాలి సోయగాలు పోతోంది.

అదే కరణంగారి చేను అది మహంతులవారి పొలం ఆ ప్రక్కనే ఆరాధ్యుల వారి పదెకరాల పసిమి జొన్న చేను. ఆ పైరుకే కాపుగా వెళుతున్నాడు శివుడు, వారం రోజులై కమతం నారాయణ వొంట్లో నలతగా వుండి ఇంట్లో పడ కేస్తే పంట కొచ్చిన చేను కాపలాకి పైడి ఘుంటంలా పిట్టల్ని పారదోల్తో మహం తుల వారి పొలం కాపు కాస్తోంది ఆ వయ్యారి.

ఈ చివర్నించి ఆ చివరిదాకా వెళ్ళేందుకు గడియ కాలం పడ్తుంది. కరణంగారి పొలం నిలువు - మెల్లిగా నడుస్తున్నాడు శివుడు.

నా మగడు వాడకెళ్ళే
నాకూ తోడెవరూ లేరు
కోడి కూసే జాముదాకా
తోడురారా వన్నె కాడా...
ఓ వయ్యారి వన్నెకాడా !

గుప్పుమని సంపెంగలు విరిశాయా ! జల్లుమని మల్లెలు కురిశాయా నెమళ్ళు కదను తొక్కాయా ! కోకిలలు గళం విప్పాయా ! పాటకు రూపం వుంటుందా ! పాటకు జీవం వుంటుందా ! రంగుంటుందా ! నిలబడి పోయాడు శివుడు.

'ఏమిటయ్యో బాపనయ్యో !' అద్దరేతిరి కాడ నీ మద్దెల దరువుకా యిట్టోస్తాన్నావ్ సుబ్బరంగా నిద్దరోక ఈ షికార్లేంటి ?

శివుడి గొంతు పెగల్లేదు

"బాపన కప్పల్లే ఏట్లో తానం జేస్తా మంతరాలు సదుగుతుంటావే ! పలకవేం బెల్లం కొట్టిన రాయిలా ?

"ఎవరూ"

'అహో మస కెన్నెలైనా గాదె - నన్ను జూచి చూపు తప్పిందేం సావి'

'గంగాయ్—'

"ఆ గంగాయినే - ఎందటా సంగతి?"

"గంగా"

'ఆ గంగనె - ఏందటా నిలువు గుడ్లేసుకుజూ త్తన్నావ్ ఎన్నడన్నా ఎన్నెల్లో ఆడపిల్లసు చూసినావా లేదా?

"గంగీ !"

"ఏందీ? గంగీ అంటున్నావ్. వొళ్లెట్టుందేం?"

"తిమ్మిరి తిమ్మిరిగా వుంది గంగీ—"

"సింతపండు రసంతాగు—పై త్తెంతగ్గి పోనాది—

"చింత—పండు ఆలోచనలోనే వచ్చాను రంగీ !"

"ఏందయ్యో బ్యామ్మడా !

"గంగి — నా మాటింటావా !

వేళ జూడా వెన్నెలాయే - వండికట్ల చిన్నదాయే

మల్లెపూలా సొగసులాయే - జొన్న చేనేపందిరాయే

వయ్యారి రావె - మనసవ్వులోనే తెల్లవారూనూ—"

పకపక నవ్వింది గంగి ! పైన వెన్నెల - కిందా వెన్నెల అటు వెన్నెల ఇటువెన్నెల ఎటుచూస్తే అటు వెన్నెల అన్నట్టు నవ్వింది గంగి—

సెబాస్ కుర్రోడా - సెవుల పొగూలవాడా !

మాబావ విన్న - కన్నా - మరి యేధ దక్కునా

మంచదిగను - నేను కంచె దాటి రాను

గంగి పాట విని గంగు వెర్రులెత్తింది శివుడికి పసుపున పాదాలు కడిగి పచ్చా పట్టంగీ తొడిగి నిన్నే పెళ్లాడుతాను - ఓ చిన చిలకా - అని ప్రమాణం చేశాడు—

వలపు కలుగదా నీకో సఖియా
మనసు పుట్టదా నాపై నీకు ?

తగిన వాడనే కానా సఖియా నుచేకొనవా చెలియా ! అన్నాడు దీనంగా

చప్పున దిగివచ్చిందిగంగి. శివుడు నెత్తి నెక్కింది ఒళ్ళోవాదిగింది వొయ్యారాలు వొలికింది. వగలు చిలికింది శివుడు చిదానందుడైనాడు.

ఎల్లొస్తనోయ్ బావమళ్లొస్తనోయ్
మళ్లొస్తనోయ్ బావ యెళ్లొస్తనోయ్
కళ్ళు తెరి సీ తలికి కళ్లెదుట వుంటాను
వళ్ళుయిరిసీ తలికి వళ్లోన వుంటాను.
అంటూ వేకువన కోడికూస్తేదానితో పాటే కుహు కుహుమంది.
శివుడు మళ్ళి తెల్లారు తోందని దిగులుపడ్డాడు
ముక్కుతూ మూలుగుతూ
ముడుచుకొని తొంగోకు
మురిసినా తలచినా
మాపటికి వస్తాను.... అంటూ హామీ ఇచ్చింది గంగి
రసగంగలో తానాలాడిన శివుడు కోరమీసం మెలేశాడు
చేతిలో చేయ్యేశాడు తాళికట్టి ఏలుకుంటానని బాస
చేశాడు సరిగా అప్పుడే సూర్యుడు తూర్పునెర్రబేశాడు.
అదిగంగి నుదుట కల్యాణ కుంకుం బొట్టయి మెరిసింది.

# చలిలో "శ్రీ" నాథుడు

ఒక చల్లని రాత్రి. తొలి జాము ఇంకా ముగియ లేదు. మాఘ్య చంద్రుడు కమ్మని వెన్నెల తన కిరణాలతో చిమ్ముతున్నాడు. చలి చలి గాలులు మంద మందంగా వీస్తున్నాయి. రెడ్డి రాజులు ప్రీతిగా ఇచ్చిన కాశ్మీరు సేలువా భుజం మీద వేలాడుతుండగా, పావు కోళ్ళు టకటకలు బరాబరులు చేస్తూవుండగా, వెంట ఆంతరంగిక శిష్యుడు చెన్నమ రాజు తోడురాగా వాడ వీధిలో నడుస్తున్నాడు శ్రీనాథకవిసార్వభౌముడు.

ఓ ఇంటికోసం ఓ ఇంతికోసం వెతుకుతున్నాడు. మలుపు తిరిగితే మరుని చేబంతి మరులదొంతి... మదవతి మాణిక్యం ఇల్లు. అంతలో చూసి ఎగసివస్తోన్న ఉత్సాహాన్ని ఉద్రేకాన్ని నియంత్రించుకుంటూ అన్నాడు.

> గుబ్బల గుమ్మ లే చిగురు బొమ్మ సువర్ణపు గీలు బొమ్మబల్
> గబ్బి మిటారి చూపుంది....దానికి నేల యొక్కనిన్
> బెబ్బులి నంట గట్టితివి పెద్దవు నిన్ననరాదు గానిదా
> నబ్బ ! పయోజ గర్భ మగనాలికి ఇంత విలాస మేటికిన్

మంత్రోపదేశంలా గురువుగారు చెప్పిన ఆ పద్యం విని ఆ సొగసు కత్తెమ చూశాడు శిష్యుడు. నిజమే ! ఆమె వయసుల సొంపు తెలిపే సోయగాలు ఇలా వున్నాయి. ఆ పక్కనే యముని వాహనం లాంటి మగడు ! అడవి కాచిన ఆ అందాన్ని చూసిన రసిక సార్వభౌముడి గుండె కదిలి కవిత్వం వచ్చింది.

నిట్టూరుస్తూ వరో అడుగు వేశారు ఇద్దరూ ! అక్కడ అరుగు ముందు నిలబడి చేయి కడుకుంటున్న వ్యక్తిని చూడగానే పక పక నవ్వాడు శ్రీనాథుడు'

'బావా! బాగున్నావా? '

"ఆహా సుష్టుగా భోంచేసే కార్యక్రమం ఇప్పుడే పూర్తయింది. మీరు నగర సంచారం బయలుదేరి "వీధి" "వీధి" తిరుగుతున్నట్టున్నారు—!

"చెన్నమ రాజా- -!"

'వింటున్నా నండీ—'

"చెన్నా! మా రామయ్య బావగురించి నువ్వెప్పుడూ వినలేదు కదూ -

గ్రామము చేనుండి పరికల్పిత ధాన్యము నింటనుండి శ్రీ

రామ కటాక్ష వీక్షణ పరం పరచే గడతేరె గాక మా

రామయ్య "బావ" (మంత్రి) భోజన పరాక్రమ మేమని చెప్పవచ్చు నా

స్వామి యెరుంగు తత్కళ చాతురి తాళఫల ప్రమాణమున్

ఇంతింత ముద్దలు చేస్తూ గుటుకు గుటుకూ మింగుతూ వుంటే చూడ ముచ్చటగా వుంటుంది.

'విన వేడుకగా వుంది బావా! నిజం! నాన్నగారు సంపాదించిన గ్రామ కరణీకమూ, ముక్కారు పండే వరిపొలాలు, ఆ రాముని దయవుంది కాబట్టే కడుపులో చల్ల కదలకుండా సుఖంగా జీవిస్తున్నారు-' అన్నాడు రామయ్య -

వస్తామంటూ శిష్య సమేతంగా కదిలి మరో నాలుగు అడుగులు వేయగానే అక్కడ దైవజ్ఞ శర్మగారి ఇల్లు కన్పించింది. చిన్న ఇల్లు, పాడికోసం పోషించుకుంటున్న పశువులు. గంపెడు సంసారం! తల చెడిన తల్లి, చెల్లెలు, వదిన.... ఆపదకూ అక్కరకూ సేకరించి పెట్టుకున్న వంట కట్టెలు.... ఇల్లంతా కిచాటుగా వుంటుంది. శిష్యుడి వైపు చూసి మనస్సులోని వెగటంతా వెలికి వచ్చేలా...

దోసెడు కొంపలో పసుల తొక్కిడి మంచము దూడ రేణమున్

పాసిన వంటకంబు పసి బాలుర శౌచము విస్తరాకులున్

మాసిన గుడ్డలున్ తలకు మాసిన ముండలు వంట కుండలున్

రాసెడు కట్టెలున్ తలపరాదు పురోహితునింటి కృత్యముల్

అన్నాడు ఆశువుగా

"గురువుగారూ ! ఒకసారి చెప్పారు

కాలకంధర ! ఈశాన ! గరళకంఠ !

విసము మెసవిన గలుగు నక్కసటవోవ

కొమ్మ మేడూరి గుమ్మ చకోరనేత్ర !

పనస తొన వంటి పెదవి చుంబనము సేయు

అలాగా ఈ పురోహితుడి ఇల్లూ, ఈ ఇంట్లో చూసిన పేడ పెంట, వంట చూసిన అసహ్యం అంతాపోయి, ఎదపొంగి పోయేలా మరో మంచి పద్యం సెలవివ్వండి. చెవుల తుప్పువదిలేలా—భావం గుప్పుమనేలా...." అని అడిగాడు చెన్నమరాజు.

శిష్యుడి మాటలు విని ఆటుచుశాడు కవిరాజు

తటిల్లత మెరసినట్లు యవ్వనం విరిసినట్లు ఆయన అంతరంగాన్ని తొందరించింది.

పంచారించిన నీ పయోధరము లాస్వాదింతునో, లేతబొ—

మ్మంచుం గెంజిగురాకు మోవిఁజిశిధాత్వర్థం బనుష్ఠింతునో—

పంచాస్త్రో"పనిషత్ రహస్య పరమ బ్రహ్మస్వరూపంబు నీ

కాంచీదామ పదంబు ముట్టుదునొ యోకర్ణాట తాటంకినీ....

"నమస్కారం కవివరా ! నేను రాజలక్ష్మిని మీరు రసికులు.... చేత పట్టినా, జిశి అనేధాతువు యొక్క అర్థమైన చుంబనాన్ని నా కెంజిగురాకు పెదవిపై ముద్రించినా మన్మథ ఉపనిషత్తుత రహస్యాలు చెప్పే పరబ్రహ్మ స్వరూపమైననా మొలనూలి మొదటి మెట్టు ముట్టినా మీ ఈదాసి జన్మధన్యమే ! వారం చెప్తితే వేచివుంటా. నక్షత్రం చెపితే అక్షయ స్వాగతం ఏర్పాటు చేస్తా.... తిధి ప్రకటిస్తే ఆతిధ్యం కురియిస్తా....ఆపై అంజలి ఘటిస్తా...." అంది.

"తథాస్తు !" అన్నారు కవిశ్రేష్ఠులు మరో అడుగు ముందుకు వేసి

"ధన్యోస్మి" అంటూ దోయిలొగ్గిందామె

చెన్నమ రాజు గురువుగారి వెంట నడిచాడు.

"చెన్నా ! చూశావా !"

"ప్రభూ ! మీ కవిత సామాన్యమా !

పంపావిరూపాక్ష బహుజటా జూటికా

రగ్వధ ప్రసవ సౌరభ్యములకు

తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా

గంభీరఘుమ ఘుమారంభములకు

కర్ణాటి కామినీ కర్ణహాటక రత్న

తాటంకయుగ ధాళధళ్యములకు

నిర్నిబంధ నిబంధమై వెనయు కవిత

తెలుగునను సంస్కృతంబున పలుకనేర్తు .... అంటూ ఆనాడు మీరు ముమ్మసుకవికి చెవులు నాచేలా చెప్పింది ఇంకానా చెవుల్లో గింగురు మంటూనే వుంది—" అన్నాడు.

ఆ మాటకు శ్రీనాథుడేమీ అనలేదు

మరో రెండు గజాలు

పదారేళ్ళ చంద్రకాంత....పరువాల మేలిపూత. సోయగాల పుంత.... సొగసుల పులకరింత నమస్కరించింది ఎదురై.

అగరుధూపాది వాపితాభ్యంతరంబు

మగువ ! నీ మన్మథచ్ఛత్ర మండపమ్మ

సర్వయోషి దసామాన్య సౌష్ఠవంబు

కాచుగావుత యోర్గంటి కటకవిటుల.... అంటూ ఆశీస్సులు వర్షించాడు. స్వస్తిక నమస్కారంతో నిలుచుందా బాలిక.

మరికొంత దూరం నడవగానే ఎక్కడినుంచో పాట వినిపించింది.

వీనుల విందులై తేనె సోన లెనయ

ముందు రాగమునకు జగన్మోహ నముగ

బాడునది జాలరి మిటారి ఈడు లేని
కాకలీ నాదమున నాడ గడుపు పాట —
అని 'విన్నావా చెన్నా ! ఎంత సొగసుగా పాడ్తుందో - ' అన్నాడు.
'చిత్రం - చిత్రజుడు మత్తిల్లేలా -'

"ఊఁ" అంటూ నాలుగడుగులు నడిచి అటు చూశాడు. తను వెళ్ళ దలచుకున్న ఆ ఇల్లూ —

ఆయన మనసులో చిన్నదిస్ఫురించింది చప్పున

అఱ గౌను, గుబ్బచన్నులు
మెఱు గుంగన్నులును గలుగు మెచ్చుల నవలా
కుఱు బోడ వేశ్య రత్నము
బఱినోవగ విడిచి నట్టి బ్రహ్మకు జే జే -

అప్పటి నుండి మనసులో నాటి తెప్పలు పెడ్తోంది ఆ తిప్పులాడి, తనకు తీరక, రాపడానికి కుదురక, వూరక యిన్నాళ్ళు గడిచాయి — అనుకున్నాడు.

'గురువుగారూ'

జాణ తనము కలదు - సవరతనము కలదు, తెలివి కలదుమోవి తీరు కలదు, చేయలంతి తమకు చేకూరె నిప్పుడు - వెళ్ళ వలయు

యిన్నాళ్ళు చేసిన జాగు వోగయి బాగయ్యే లాగు వెళ్ళండి —
'ఛళా చెన్నమ రాజా !
మాఘ మాసంబు పులి వలె మలయు చుండె
బచ్చడంబేల ఉవిదయే వెచ్చ నిచ్చు
ముదిత చన్నులు పొగలేని ముర్మురములు
చలికి నొఱగొయ కేలుందు సైయనంగ !

అన్నాడు కందర్ప దర్పభంగంగా —

ముకుళిత హస్తుడై "కందర్ప శాస్త్రవేదులు ఇంతకు యింతింత చింత యేలా నెఱపన్ - సందేహింపకనడువుడు—" అన్నాడు.

తొందరించిన మదనుని సందడింపుతో సరభసంగానడిచాడు.

ఆసమయంలో ఆ ఆటవెలది చీపురు తీసుకుని బయటకు వచ్చింది.

ఆ రోవెలది - మన్మధుని ఆరో వెలది

పలికితే తేనియలొలికే - చురుకు చూపుల కొమ్మంచులు ఉలికి పడే కులుకుల కలికి.... కానీ ఆసమయం ఆవేశం....

రసిక సార్వభౌముని మనస్సుచివుక్కుమంది చప్పున వెనుదిరిగి....
'రా చెన్నా ! వెళ్లిపోదాం—'
'గురువర్యా—' తత్తర పాటుతో అన్నాడు
'అవును చెన్నా !'
అసలది భోగముదైతే
కుశల ప్రశ్నంబు వేసి కూర్చోమనదా ?
కసపూడ్చు కరకు ముండకు

రసి కతయన యేమి తెలియు రా ! రా ! చెన్నా—'అంటూ విసవిస నడిచాడు.

అవును—

శ్రీనాధుడు శృంగార రస శ్రీనాధుడు—
కవిసార్వభౌముడు రసిక సార్వభౌముడు—
కవిరాజు సరస కవిరాజు—
అంతేకాని రసహీనుడుకాడు.

# నిద్రా దరిద్రుడు

మన సాహిత్యంలో ఒక కావ్యంతోనో ఒక నాటకంతోనో ఒకే ఒక నవలా రచనతోనో సుప్రసిద్ధులై శశ్వత్ శాశ్వత కీర్తి సంపాదించుకున్న మహనీయులు ఎందరో వుండవచ్చు. లేదా కన్యాశుల్కంతో గురజాడ, వరవిక్రయంతో కాళ్ళకూరి, కాలాతీత వ్యక్తులతో శ్రీమతి డాక్టర్ శ్రీదేవిలా చిర యశస్సు సంపాదించుకొని పాఠకుల హృదయ సామ్రాజ్యంలో శాశ్వతంగా నిలిచి పోవచ్చు. వాళ్ళు మరెన్నో రచనలు చేసి వుండవచ్చు. అయితే ఈ రచనలు కీర్తి సంతరించుకోక పోవడంవల్ల అవి గుర్తులో నిలువలేదు.

అలాగే కీర్తి శేషులు శంకరం బాడి సుందరాచార్యులు అనే కీర్తి శేషులు బుద్ధగీత లాంటి లఘు కావ్యాన్ని రచించినా, మరింకెన్నో రచనలు చేసినా అవి ఇప్పుడు ఏ కొందరికో తప్ప అందరికీ గుర్తులేవు. అయితే మూడు కోట్లు ఆంధ్రులున్న ఆనాటి నుంచి ఆరుకోట్ల ఆంధ్రులయిన ఈనాటి వరకూ వారి పేరు మార్మోగేది ఒకే ఒక గేయంతో; అది తెలుగు తల్లి సంకీర్తనం. మా తెలుగు తల్లికీ మల్లెపూదండ. మా కన్నతల్లికీ మంగళారతులు అంటూ ఆయన మాతృభూమిని మాతృ భాషలో చేసిన స్తవం తెలుగు భాష, తెలుగునాడు, తెలుగువాడు, తెలుగు తేజం ఉన్నన్ని రోజులూ ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. ఒక వందేమాతరం లాగా (బంకిం చంద్ర ఛటర్జీ) ఒక జనగణ మనలాగా (రవీంద్ర నాథ ఠాగూరు) అది తెలుగు వారికి ఒక జాతి(య) గీతం.

ఇప్పుడు పేర్కొన్న మహనీయులంతా ఒకటో రెండో రచనలు చేసి ఏ ఒక్క దానివల్లో అజరామరమైన కీర్తిని పొందిన వాళ్ళు. కాని సంస్కృత సాహిత్యంలో ఒకే ఒక్క శ్లోక రచనతో ఆనాటి నుంచి నేటి దాకా రసిక రంజ

నంగా రసిక జన మనోహరంగా చేసిన ఆ ఒక్క శ్లోక రచనతో రసిక హృద యాల్లో నిలిచి పోయిన కవినాటి నుంచి నేటిదాకా ఒక్కడే ఒక్కడు...

ఆయన పేరు మాతృ గుప్తుడు.

ఆయన విక్రమార్క చక్రవర్తి కాలపువాడు.

ఆయన విక్రమార్కుని తరపున కాశ్మీర దేశాన్ని పరిపాలించినకవిరాజు.

అయితేనేం—ఆయన పేరు కవిగా నిలిచింది. 'నిద్రా దరిద్రుడనే'.

మాతృగుప్త కవిబిరుదం నిద్రాదరిద్రుడు. ఆయన చెప్పిన శ్లోక భావం పరిపుష్టమై రసవంతమై భావపూర్ణమైనందువల్ల ఆ ఒక శ్లోకం చేతనే ఆయన పేరు మరుగునపడి ఆయన బిరుదం 'నిద్రాదరిద్రుడు' శాశ్వతంగా నిలిచిపోయింది.

ఒక మహారాజు రాజ్యం చేసే బంగరు కాలంలో ఆ రాజు రసికుడై సరసుడై సంగీత సాహిత్యాల్ని పోషిస్తే ఆరాజ్యంలోని కవులే గాక గాయకులే కాక ఇరుగు పొరుగు రాజ్యం కవులు పండితులు గాయకులు కూడా ఇక్కడికి వచ్చి సభా ప్రవేశం చేసిసన్మానం పొందుతారు. ఆదికవులకున్న స్వేచ్ఛ ఒక దేశానికి ఒకకాలానికి కవులు బద్ధులుకారు కాలేరు అలాఎవడైనా అయితే వాడు అచ్ఛమైనకవి కాదన్న మాటే !

ఒక మహారాజు యథేచ్ఛగా చతురుదధి వేలా వలయిత మహీ మండలాన్ని ఏకచ్ఛత్రంగా పరిపాలిస్తే రాజు ప్రాపకం సంపాదించుకోగలిగిన కవికే భాగ్యం దక్కుతుంది. మిగతా కవులకు కానీ పండితులకుకానీ గాయకులకు కానీ ఆ అదృష్టం, ఆ అవకాశం దొరకదు ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయలు పాలించిన స్వర్ణయుగంలోనూ సంకుసాల నృసింహ కవివంటివాళ్ళకు వలసిన స్థానం దొరికిందికాదు. అలాటి వాళ్లు ఇంకెందరుండినారో మనకు నిక్కచ్చిగా తెలీదు.

అంతఃపుర ప్రవేశానికి రాజదర్బారులో చేరడానికి ఎన్నెన్నోద్వారాలు ద్వారం ద్వారం వద్ద ఒక్కో ఘటికుడు ఉంటాడు కదా ! ఉద్దండుడైన వికట కవి రామలింగ కవికే అంత సులుపుగా భువన విజయ సభా ప్రవేశం దొరికింది కాదంటే నోరుమెత్తని నోరెత్తని వాళ్ళ మాట చెప్పాలా.

శ్రీ విక్రమార్క చక్రవర్తి పరిపాలన చేసే రోజుల్లోని కథ ఇది.

ఒక రోజు రాజుగారికి హఠాత్తుగా మెళుకువైంది. అపుడు సమయం యెంతైనదని భటుడిని అడిగాడు.

అతగాడు చాలా నిక్కచ్చిగా చెప్పాడు. అంత సరిగ్గా కాలగణనచేసి చెప్పగానే రాజుగారికి ఆశ్చర్యం వేసి అడిగాడు. దానికా భటుడు తనకి నిద్ర దూరం అని చెప్పాడు. ఎందుకు నిద్ర దూరం అంటే బ్రతుకు భారం.... రోజూ రావలసిన భటుడి స్థానంలో పొట్ట కూటి కోసం తాను రావలసి వచ్చిందని చెప్పాడు కవిగారు. రాజు గారికి నిద్రా భంగంతో ఆగక నిద్ర దూరమై వివరాలన్నీ అడిగాడు.

అప్పుడు భటుడిగా ఉన్న "మాతృ గుప్తుడు" అన్న "కవి" ఓ శ్లోకం చెప్పాడు అది ఇది.

> జానే కోప పరాఙ్ముఖీ ప్రియతమా స్వప్నేద్య దృష్టా మయా॥
> మామామ్ సంస్పృశ పాణినేతి రుదతీ గంతుం ప్రవృత్తాతతః
> నోయావత్పరి రభ్య చాటుక శతై రాశ్వాస యామి ప్రియాం॥
> భ్రాత స్తాన దహం శఠేనవిధినా నిద్రా దరిద్రః కృతః ॥

కోపంతో వెను దిరిగి పోతున్న ప్రియతమను ప్రసన్నం చేసుకోవాలను కుంటూ వుండగా నిద్రా భంగమై స్వప్న భంగమైంది. కల చెదరి పోవడంతో "కాంత" కదిలి పోయింది. కలలో కనిపించి అలరించి ఆపై కోపగించి వెళ్ళిపోయిన ఆ ప్రియురాల్ని మళ్లీ నిద్రపోయి మళ్లీ కలగని మళ్లీ ఆ ప్రియురాల్ని కలలోకి తెచ్చుకుని ఆమెని ప్రసన్నం చేసుకొని ఆమె ప్రేమను పొందుదామంటే నిద్రేరాదు. నిద్రా దరిద్రుడికి ఇక కల ఎక్క

డిది? కలే లేకపోతే కలలోని కాంత ఎక్కడుంది? ఆమెను ప్రసన్నం చేసు కోవడం ఎక్కడుంది.

అస్సలు నిద్ర సుఖం ఎరగనయ్యా మహారాజా అని చెప్పడానికి ఆయన చెప్పిన శ్లోకం అది

ఈ "మాతృ గుప్తుని" ప్రస్తావన విశ్వనాధవారి కాశ్మీర దేశ నవ లల్లో వస్తుంది. ఆ కాశ్మీర దేశనవలల్లో.... కల్హణుని రాజ తరంగిణి ఆధా రంగా చేసుకొని విశ్వనాధవారు సృష్టించిన ఆరునవలల్లో "భ్రమర వాసిని" ఒకటి.

ఆ "భ్రమర వాసిని" నవలమీద పరిశోధన చేసిన సుగృహీత నామ ధేయ కాశీనాధుని సువర్చలాదేవిగారి సిద్ధాంత గ్రంధంలో వుంది ఈ శ్లోకం.

శ్లోకం ఎంత మధురమో ఎంత దుర్లభమో ఎంత శ్లాఘనీయమో స్మర ణీయయో విశ్వనాధవారి భ్రమర వాసిని పై జరిగిన పరిశీలనం కూడా అంత ప్రశంస నీయం.... పఠనీయం.... ఓ గొప్ప కవి గురించి చెప్పుకునే సమయంలో ఒక గొప్ప "వ్యాఖ్యానాన్ని" గూర్చి చెప్పకోవడం తప్పుకాదనుకుంటాను.

# వేయిచేతుల ఆలిని వెతుక్కొనే వాడి, వేడి మగడు

ఎండలు! ఎండలు! ఎటుచూసినా ఎండలు? ఎలా వున్నాయి ఎండలు?

ఈ ఎండలు ఘండిపోతూవుంటే ఆతప తాపానికి తట్టుకోలేక దేవతలు ఎలా ఉన్నారట!

దట్టమగు మేఘముల వట్టివేరుల తెరలు
కట్టి జాబిలి నాలవట్టమ్ము చేసికొని
గట్టి వేల్పులు చదలపట్టి వారెందులకు
అట్టహాసపు వేడినాపుకో జాలుటకె!

అంతటి దేవతలే వేడిమికి తట్టుకోలేక వట్టివేళ్ళ తడికల చాటున దాక్కున్నారంటే మనం వట్టివేళ్ళ తడికల తడిపి తడవడంలో వింతేముంది? ఏసీల మాటున కూలర్ల చాటున దాక్కుంటే వేడిగాలి వేడి విసురూ తగ్గుతుందేమో కాని ఋతుప్రభావంతో పుట్టుకొచ్చే వేడి ఎక్కడికి పోతుంది. శరీరాన్ని అంత రాంతరంగా తపిస్తూనే వుంటుంది

ఎండకు ఎండిన భూమిపగుళ్ళు పారుతుంది వేసవిలో! వేసవికి ఎండి వర్షంతో తడిస్తేనే భూమి సారవంత మౌతుంది నాగలితో చీల్చిన దానికంటే భూమి తనంతతాను పగుళ్ళు వారితేనే పంట పండేది. ఈ సహజ పరిణామాన్ని కవితన దృష్టిలో ఎలా చూస్తున్నాడో చూడండి

ఛాయయను తన భార్య మాయమై దాగుకొన
వేయికరములతోడ వెదకెనో సూర్యుడన

కాయుచుండెడి యెండతాక కోర్వని ధరణి

వేయి చోట్లను పగిలి ఎడద బీటలు వారె!

ఛాయ అంటే నీడ! ఛాయ సూర్యుడి భార్యట! వెలుగెక్కడ వుంటుందో దాని మాటున్నే నీడ వుంటుంది కదా! వేయంచుల వేలుపు వేడి వేడి కిరణాలు వెదజల్లుతూ వుంటే అది రవి తన భార్య ఛాయను వేయి చేతులతో వెదుకుతూ వున్నట్లు వుందట! ఆయన కిరణాలు నేరుగా సోకేది భూమినే కదా! అంచేత ఆకాకకు ఓర్వని భూమి తనంత వేయిచోట్ల పగిలి చీలికయి బీటలు వారిందట! ఏమయా! నీ భార్య ఇక్కడ భూమ్మీదే కాదు భూమికింద కూడా దాక్కోలేదు! కావాలంటే చొచ్చుకుని వెళ్లి చూడు అన్నట్లుగా బీటలు వారిందట భూమి! ఎంత గొప్ప ఊహ!

ఇంకో ఊహా చిత్రం చూద్దాం.

ఆయన తీక్షణాంశువు! బాగా దప్పికొన్నాడు! దానితో పాటేఆకలి! అంచేత ఎక్కడ కన్పిస్తే అక్కడ తినేస్తాడని భయపడుతోంది నీడ! చెట్లు దట్టంగా పెరిగి కొమ్మకు కొమ్మగా రెమ్మకు రెమ్మగా విస్తరిల్లి తమచుట్టూ నీడను నిలుపుకుంటాయి

అంచేత తీక్షాంశు కిరణాల తాకిడికి తట్టుకోలేని నీడ వృక్షపాదాలను ఆశ్రయించదట! అయితే ఆక్కడేమిటి సంగతి! వేసవిలో వేళ్ళతో నీటిని పీల్చుకుని పీల్చుకుని ఎక్కడా జలందొరకని చెట్లు తపనతో తపిస్తున్నాయి! ఎక్కడెక్కడి జలా చాలటంలేదు. అందడంలేదు. ఆ అక్షీణక్షుదతో ఆ చెట్లు ఒకవేళ నీడల్నే తాగేస్తాయేమోనని చెట్టు పాదాలను ఆశ్రయించిన నీడ చూస్తూ చూస్తూ వుండగానే పారిపోయిందిట!

తీక్షాణంశు వాకలిచే తినివేయునని వగచి

వృక్ష పాదములంటి వేడుకొన్నది నీడ!

అక్షీణక్షుధ చేత ఆతరువు త్రావునని

వీక్షించు చుండగనె వదలి పోయినది!

ఎంత సహజమైన వర్ణన! భయంతో పెద్దవాళ్ళపాదాలు పట్టుకోవడం-ఆమీదట ఆపెద్దలే మింగేస్తారని భయపడి పారిపోవడం లోకరీతిని ధ్వని చడం లేదూ !

మండుటెండలో మానవులు తిరుగాడలేరు మహారాణులూ తిరుగాడలేరు ! వీళ్ళమాట కేందేవతలు కూడా దివినుండి భువికి దిగిరారు ! ఎందుకట ! తీవ్ర తాపక్షోభ వివరాలు తెలిసిట !

భువినున్న మానవులు భూ మీఁద రాణువలు

అవురవుర! మరుభూమి నడుగు పెట్టనికతమె—

దివినున్న దేవతలు తీవ్రతాపక్షోభ

వివరాలు తెలిసియే పృదివి నడుగిడలేదు!

భూమిమరుభూమి అయ్యాక మానవులు మనుగడ సాధించే వాళ్ళఎలా అడుగుపెడ్తారు ? మాములు వాళ్ళే అడుగు పెట్టలేక పోతే రాణులు రాగలరా ? వాళ్ళూ వీళ్ళూ ఎందుకు దేవతలే రాలేరు ! ఎందుకు ? వాళ్ళు అమరులు! వాళ్ళకు మరుభూమిలో అడుగిడే అవకాశం లేదు మానవ రక్షణ కోసం పైనుంచి కిందికి దిగివచ్చే దేవతలు— తీవ్ర తాపంతో భూమిక్షోభించి మరుభూమి అయ్యిందని దిగిరావడం లేదు ! శ్మశానంలో వాళ్ళకేం పని ?

కవి ఊహాకు అన్నీ చిత్రంగానే కన్పిస్తాయి ! రాముడు సముద్రం దాటాలి ! అందుకోసం సేతువుని నిర్మించాలి ! మరి వారధి కట్టడానికి అక్కడే ఉన్న ఇసుకను ఎందుకు వాడుకోలేదు ?

దానికో చిత్రమైన సమాధానం చెపుతూన్నాడు కవి!

చమత్కారం చూడండి!

మండు వేసగిలో ఇసుక దానికి రెట్టింపుగా మండిపోతుంది ! మామూలు నేలకంటే ఇసుకనేలలు త్వరగా వేడెక్కి-పెనం మీద వేయించినట్లు ఇసుక రేణువులు వేడిలో ఇసుక రేణువులా మండుతాయి! ఆ మండే యిసుకను సముద్రంలో వేస్తే ఆ సముద్రం మండిపోతుందేమో అది మనకెందుకు అనుకుని కోతిమూకలు కొండలను పెకిలించి వారధి నిర్మించాయటి! అహో అద్భుతమైన ఊహ!

మండు ఈ ఇసుకతో దండి వారధి కట్ట
మండునేమో జలధి మనకేల ఇది యనుచు
కొండలను పెకిలించి కోతిమూకలు నాడు
దండెత్తి పోయినవి దానవుల నోడించ

తమిళంలో జయగొండన్ కవితలు చదువుకుని తనివితీరా ఆనందించిన ఆరుద్ర తన తెనుగువాళ్ళకోసం తెనిగించిన "వేసవి" పద్యాలివి—ఆయనవే "వెన్నెల" పద్యాలు మళ్ళ "వెన్నెల్లో"

# పప్పూ .... నెయ్యీ .... పసందైన మనుషులు

నాలుగు పద్యాలు చెబితే గొప్పకవిగా తనకుతానే చెలామణి చేసుకుంటారు. కానీ ఒక అద్భుతమైన చంపూగ్రంథాన్ని చెప్పినా తనపేరు చెప్పకోని 'సుకృతి' ఉన్నారు. ఎవరో తెలుసా? భోజరాజ చరిత్రమనే ఒక మహత్తర గ్రంథమును రచించిన కవీంద్రుడు. ఆయన ఎవరో, ఏ కాలంవాడో ఎక్కడ ఉండేవాడో, చరిత్ర పరిశోధకులకూ తెలియదు. సాహిత్య పత్తేదార్లకు తెలియదు.

అయితేనేం ఆయన చెప్పిన చాలా శ్లోకాలు సూక్తులుగా వాడబడుతున్నాయి. ఆ గ్రంథంలోని చాలా శ్లోకాలు తెలుగులోనికి అనువదింపబడ్డాయి. పేరు తెలియక పోయినా ఆ కవి ఆ చంద్రతారార్కం నిలబడే సత్తాకలవాడు. 'పేరులోన ఏమి పెన్నిధి కలదు' అని ఆరోజుల్లోనే అనుకున్నాడేమో!

భోజరాజ చరిత్రం చాలా తేలికైన సంస్కృత భాషలో వ్రాయబడినది. తెలుగుపద్యం కొన్ని చోట్ల సంస్కృత పదభూయిష్టమై అర్థంకాదేమోకానీ-ఈ సంస్కృతం మాత్రం తెలుగుకంటే తేలిగ్గా తెలిసే సంస్కృతం.

"స్వస్తిశ్రీ శ్రీమన్మహారాజస్య భోజరాజస్య ప్రబన్ధః కథ్యతే" అని ప్రారంభమవుతుంది కథ. భోజుడి తండ్రి సింధులుడు. ఆయనకు లేకలేక ఒక కొడుకు పుట్టాడు అదీ వృద్ధాప్యములో. అతడికి అయిదేళ్ళు వయసొచ్చింది. కొడుక్కి రాజ్యం కట్టబెడితే బలవంతుడైన తమ్ముడు ముంజుడు ఏం చేస్తాడో కొడుకుని చంపేస్తాడో-రాజ్యం ఆక్రమిస్తాడో అని భయపడ్డంతో ముఖ్యమంత్రిని

పిలిచి విచారించడంతో కథ నడక మొదలు పెడుతుంది. రకరకాలుగా ఆలోచించిన మహారాజు తమ్ముడికే పట్టం కట్టి పెడతాడు. కొడుకని అప్పగిస్తాడు.

అయితే భోజుడి 'జాతకం' విన్న ముంజుడు అతన్ని చంపాలని వివిధ ప్రయత్నాలు చేస్తాడు. చివరికి బుద్ధి మారి అతడికే రాజ్యం అప్పగిస్తాడు. అక్కడి నుంచి భోజ చరిత్ర మొదలు. 'యథారాజా తథా ప్రజా' అనే మాట తెలుగు నాట సామెతయ్యింది. దాని పూర్తి శ్లోకం ఇది.

రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠా పాపే పాపపరాః సదా
రాజాన మనువర్తన్తే యథారాజా తథా ప్రజాః

అంటే రాజు ధర్మవంతుడైతే ప్రజలు అలాగే ఉంటారు. రాజు పాపాత్ముడు అయిన అలాగే ఉంటారు రాజెలా ఉంటే ప్రజలూ అంతే.... అని

ఇలాంటి సూక్తి ముత్యాలు కోకొల్లలు.
ఏదైనా చేయాలన్నా ఇవ్వాలన్నా తక్షణమే చేసేసేయాలన్నా. అని
చెప్పే శ్లోకం ఇది
ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్యచ కర్మణః
క్షిప్ర మక్రియ మాణస్య కాలః పిబతి సంపదః

తీసుకోవాలన్నా ఇవ్వాలన్నా అదివెంటనే చేసేయాలి. అలాకాక అప్పుడో ఇప్పుడో ఎప్పుడో అనుకుంటే కాలం ఆ సంపదని మింగేస్తే ఆ మీదట ఇవ్వటం ఉండదు పుచ్చుకోవడము ఉండదు.

మంచి చెప్పేవాడు - వినేవాడు లోకంలో ఉండరు అనే నీతి చెప్పే శ్లోకం చూద్దాం.

సులభాఃపురుషాలోకే సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చదుర్లభ

కమ్మని కబుర్లు చెప్పేవారు ఎక్కడ పడితే అక్కడ ఉంటారు. అయితే చెప్పేటప్పుడు కష్టంగా ఉన్నా తరువాత మేలుకూర్చే మాటలు చెప్పేవాడు. దాన్నివినేవారు దొరకడం కష్టం.

ఈ భోజరాజు గురించే ఓ తమాషా (శ్లోకం) పద్యం ఉంది. ఎవరో కవి ఒక పాదం రాసుకొని వచ్చాడు. కాళిదాసుని ఆశ్రయించి రాజుగారితో సంభావన ఇప్పించండని అడిగాడు. మిగతాపాదం కవిగారు పూరించి రాజసభా ప్రవేశం చేయించి సన్మానం చేయించారు. ఆ శ్లోకం మొదటి భాగంలో కేవలం ఆశా, అర్థింపు ఉంది. కవిత్వం లేదు. రెండో భాగంలో చక్కని ఊహ ఉంది చూడండి.

భోజనందేహి రాజేంద్ర ఘృత సూప సమన్వితం
మాహిషం చ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి.

ఓ రాజా! భోజనం పెట్టు - పప్పు నెయ్యి కూడా ఉండాలి. ఇదీ అపండితుడి కైత. శరత్కాల వెన్నెలలా తెల్లగా ఉండే గేదెపెరుగు ఉండాలి అనేది కాళిదాసు కవిత. పెరుగుకి వేసిన విశేషణంలో ఉంది కవిత్వమంతా !

కువిందుడనే నేతపనివాని కథ మరీ చిత్రంగా ఉంది. కవిత చెప్పే వాడు తప్ప మరొకడు రాజ్యంలో ఉండరాదు.... అంటే కువిందుడు ఒకడే దొరికాడు. రాజును చూసీ చూడగానే కావ్యం కరోమి-నహి చారుతరం కరోమి యత్నాత్ కరోమి యదిచారుతరం కరోమి – భూపాల మౌళిమణిరంజిత పాద పీఠ : హేసాహసాంక కవయామి వయామి యామి. అని కవిత్వం చెప్పాడు. అయ్యా కవిత చెప్తాను అయితే బాగా చెప్పలేను కానయితే కష్టపడితే బాగా చెప్ప గలనేమో ! ఓ మహారాజా.... కవయామి (కవిత్వం చెప్తా) వయామి (నేస్తా) యామి (వస్తా) అని మూడు ముక్కలు చెప్పేసరికి రాజు పొంగి లొంగిపోయాడు. స్నేహాన్ని గూర్చిన మరోగొప్ప శ్లోకం ఉంది.

స్నేహో హివరమఘటితో నవరం
సంజాత విఘటితః స్నేహః
హృతనయనోహి విషాదీ నవిషాదీ భవతి
సఖలు జాత్యంధః

మైత్రి చేయకుండుటే మేలు. స్నేహం చేసి వదిలేయడం విడిపోవడం మంచిది కాదు కళ్ళుపోయిన వానికి బాధ. కానీ పుట్టుగుడ్డికి అంత బాధ ఉంటుందా? ఎంత చక్కని ఉపమ !

మహారాజు పాలనలో కవులంతా సుఖంగా ఉన్నారు. ఎవడో ఒక కవికి అవకాశం చిక్కలేదు. దానికి రాజుగారు కారణమడిగితే కవి చమత్కారంగా ఎలా చెప్పాడో చూద్దాం.

రాజన్ కనకధారాభిః త్వయి సర్వత్ర వర్షతి
అభాగ్యచ్ఛత్ర సంఛన్నేమయి నాయాన్తి బిందవః

భోజరాజా ! నీవు కనక వర్షాన్ని కురిపిస్తున్నావు. అంటే నేం దుర దృష్టమనే గొడుగు నా తల మీదుంది. ఒక చినుకైనా నా మీద పడ్డం లేదు సుమా!

ఇలా ఎన్నెన్ని కథలు. ఎన్నెన్ని చమత్కారాలు. ఒక్కో కవి రాజ దర్శనానికి వస్తే ఒక్కో చమత్కారం చెప్పాడు. ఒక్కో విశేషం ఒక్కో అద్భుతం. ఓ కవి వచ్చాడు. తన అన్ని కష్టాలకు మూలం దారిద్ర్యం అనే చెప్పుకుంటున్నాడు ఎలా —

అంబా కుప్యతి నమాయా, నతయా సా
చాపి నాంబయా నమయా
అహ మపి న తయా నతయా వద
రాజన్ కస్య దోషోయం

మా అమ్మకు కోపం వస్తుంది. అందుకు నేను కారణం కాదు. మా ఆవిడా కాదు. మా ఆవిడకు కోపం వస్తుంది. కారణం నాది కాదు మా అమ్మదీ కాదు. అన్నట్టు నేనూ కోప్పడతాను! అందుకు కారణం మా అమ్మా కాదు. మా ఆవిడా కాదు. మరి తప్పంతా ఎక్కడా! ఎవరిది?.... అంటే అన్ని తప్పులకు మూలం దారిద్ర్యం.

ఈ భోజ చరిత్ర స్వారస్యాన్ని మాటలతో చెప్పడం సాధ్యం కాదు. చదివి చూడాల్సిందే....

# లలన పాదం పారిజాతమైంది

భామనే! సత్యభామనే! భామరో! పదియారువేలా కోమలులాందరి లోనా పేరెన్నికగన్న సుందర సుకుమారి సత్యభామ. అలనాడు శ్రీకృష్ణుల వారికి ప్రియ పత్నిగానేకాక ఈనాటికి అఖిల జనావళికి ఆరాధ్యనాయిక సత్యభామ. అందానికి, అందానికి తగ్గ ఠీవికి, ఠీవికి మించి అహంకారపూరిత గర్వానికి ప్రతీకగా 'సత్యభామ'నే పేర్కొంటారు జనం.

ఆ సత్యాకృష్ణుల సయ్యాటల వయ్యారాలు. రాగాల సరాగాల పరాగాలు అందమైన మధురమైన కవితలో ఇంతకంటే చక్కగా చిక్కగా ఇంకెవ్వరూ చెప్పలేరనే రీతిలో చెప్పిన కావ్యం పారిజాతాపహరణం.

ఒకరోజున నారదులవారు దివినుండి భువికి దిగివస్తూ వూరికే రాక పారిజాత ప్రసూనాన్ని తెచ్చాడు. తెచ్చిన పువ్వు ఎవ్వరికో ఇవ్వక నల్లనయ్యకే ఇచ్చి-ఆపై ఊరుకోక అక్కడే నిలబడ్డాడు.

ఆపూవు తీసుకొని రుక్మిణిని చూసినా అయ్యగారి మనస్సులో సాత్రాజితే మెదిలింది. దాంతో కథ అడ్డం తిరుగుతూఉంటే కలహాశనుడు తెలిసిపెట్టిన చిచ్చు రేగుతుందే అనుకొని అక్కడుండి ఇంకెవ్వరికో పంపడం భావ్యం కాదనుకొని రుక్మిణికే ఇచ్చాడు. ఆమెదాన్ని జడలో తురుముకుంది. వెంటే చక్కదనానికికొక చక్కదనం, యవ్వనానికికో వింతయవ్వనం వచ్చేశాయావిడకి. ఆ మీదట నారదుడు భట్రాజులా ఆపూవు మహిమ పొగిడి, ఇన్నిదినాలు సవతులందరిలో సత్యభామ కనుసన్నల్లో వశంవదుడై శ్రీకృష్ణుడు నడుచుకుంటాడని విన్నాను కానీ ఇది అబద్ధం. నువ్వంటేనే ఆయనకి గౌరవం. అయినా చక్కని దాన్నని, ఎలజవ్వనినని-అందరిలో పేరున్న దానినని-భర్త తనకు అనురక్తుడనీ-

గర్వించే సత్యభామ ఈసంగతి విన్నవాళ్ళు కన్నవాళ్ళు చెబితే నిలువునా కుంగి పోతుంది అని చిన్న గుగ్గిలం విసిరి వెళ్ళాడు.

ఇంకేముంది! కొంపలంటు కున్నాయి.

మిగతా ఆరుగురు ఏదోవిధంగా సరిపెట్టుకున్నా-మానవతి సౌందర్యవతి, మహనీయ సౌభాగ్యవతి-సత్యమాత్రం సరిపెట్టుకోలేదు. చెలికత్తె వచ్చి సన్నాయి నొక్కులు నొక్కగానే ఆజ్యంపడ్డ అగ్ని భగ్గుమన్నట్టు, దెబ్బతిన్న నాగుబాము బుస్సుమన్నట్టు "ఏమేమీ! నారదుడు అలా అన్నాడా?" అని "చెవివొగ్గి విన్నాడా అయన? ఇంకేం జరిగిందో చెప్పు" అని నిగ్గదీసింది.

అంతా వింది ఆపై కలకాలం ఒక్కరీతిగా పూసలలో దారంలా మదిలో మెదిలే మగవాళ్ళు లభించడం పూర్వజన్మ సుకృతం అనుకుంది. తనతో ఎలా - మెలిగేవాడో తలపోసింది. మగడు ప్రాణ సమానుడు అతడే దైవం - దిక్కు - అలాంటి మగడు దారి తప్పితే కులస్త్రీలకు ఇంకేంగతి అంది ! ధన మిచ్చి పుచ్చుకుంటే ఓర్వవచ్చుకాని మొగడు పరస్త్రీలకి మనసిచ్చి పుచ్చుకుంటే ఎలాబతికేది అనివాపోయింది. వెంటనే కట్టిన చీరవిడిచి మాసిన చీర కట్టుకొని లోపలింట్లో మంచం పట్టి కర్చుకొని లోలోపల కుములుతూ పడుకుంది.

అప్పుడొచ్చాడు అయ్యగారు. చూస్తే వాతావరణం మారిపోయింది. అంతటా నీరవం కొంప మునిగింది పువ్విచ్చిన విషయం ఎవరో చెవిన వేశారు అనుకొంటూ లోపలికి వెళ్ళారు. ఆపై ఎన్నెన్నో నయగారాలు పలికాడు. ఏందుకు ఆభరణాలు ధరించలేదు ! మంచి గాగరా ఎందుకు తొడగలేదు. ఏమిటి ఈ మౌనం ? ఏల చూడవు ? మాటాడవు ? మెరమెచ్చుల కోసం ఇతర వనితలతో ఏ తీరునో్నా మెలిగినా-పాయని అనురక్తి నీమీదే కదా! భామా! నువ్విలా ముద్దివ్వక ముఖం చూపక-లేవకుంటే నేనెలాతాళగలను - అంటూ ఆజగన్నాటక సూత్రధారి ఆమె 'మృదుపల్లవ కోమల పదద్వయికి' అర్మిలి మొక్కు మొక్కాడు.

అప్పుడామె

జల జాతాసన వాసవాది సురపూజాభాజ నంబై తన
ర్చు లతాంతాయుధుకన్న తండ్రి శిరమచ్చో వామ పాదంబునన్
దొలగం ద్రోచె లతాంగి అట్లయగు నాథుల్నేరముల్ సేయ పే
రలుకం చెందిన యట్టి కాంతాలుచిత వ్యాపారముల్ నేర్తురే.

అది బ్రహ్మ ఇంద్ర, వరుణాది దేవతలు పూజ్య భావంతో నమస్క రించే శిరస్సు కుసుమశరుడి కన్న తండ్రి శిరస్సు - దాన్ని ఆమె ఎడుమకాలితో తొలగ తోసింది అవును అంతే కదా ! మగడు తప్పు చేస్తే కోపంతో భగ్గున మండే కుల స్త్రీలు ఇంకేం చేస్తారు. అది ఉచితమో అనుచితమో ఆలోచించే అవకాశం ఎక్కడిది ?

తన్నినా తిన్నగానే తన్నిందని ఆ నల్లనయ్య ఆమెపాదం సోకగానే ఒళ్ళంతా పులకరింతలు అయి మదన రాజ్యం లభించినట్టు పొంగి అంటారు." నన్ను నీ పాదదాసుని కోపంతో అలిగిన ఆవేశంతో నువ్వు తిన్నగా తన్నినా అదినాకు మన్ననే ! కానీ నాతలతాకి అందమైన చివురాకు సదృశ్యమైన నీ పద పల్లవం నొచ్చిందేమో అని బాధగా ఉంది. సరేలే ! ఇకనైనా కోపం పోయిందా! అన్నాడు నవ్వుతూ.

సత్యభామ అధరం అదరగా-కళ్ళు ఎరుపెక్కగా 'ఈ నయగారాలు- ఈ ప్రియోక్తులు—ఈ మొగమిచ్చు కాలు చాల్లే ! నిన్నే నమ్ముకున్నందుకు మంచి మేలే జరిగింది. అని ముక్క చీవాట్లు పెట్టి బుడి బుడి ఏడ్పులు ఏడ్చింది! ఎలా? పంకజ శ్రీ సఖమైన మోము పయి చేల చేరంగిడి బాల పల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూకల కాక లీధ్వనిన్ - చక్కనమ్మ చిక్కినా అందంగానే వుందన్నట్లు సత్యభామ ఏడుపు కోకిల కూసినట్టుందట !

ఆమె అలా ఏడిస్తే అయన ఆమెని కౌగిట్లోకి తీసుకొని బుజ్జగించి చెక్కిలిమీద జారే కన్నీరు తుడిచి నెయ్యము తియ్యముగా అన్నాడు. పువ్విచ్చానని ఇంతరాద్ధాంతము చేశావు. నీ శుద్ధాంతంలో ఆ పారిజాతాన్నే తెచ్చి చలువ వెద

జల్లు చెంగల్వ కొలని కెలన సరస కర్పూర కదళికా తరుల నడుమ - పెరటి చెట్టుగా నాటిస్తా అని వాటేసుకొని అన్నాడు.

ఇంకేముందీ కథ కంచికి —

ఈ కథను నంది తిమ్మన ఆడుతూ పాడుతూ చెప్పాడు. శ్రీకృష్ణదేవ రాయల వారి ఆస్థానంలో అరణపు కవిగా అమ్మవారి వెంట వచ్చిన తిమ్మన పని గట్టుకొని ఈ కథ ప్రబంధీకరించడానికి ఓ పసందైన కథ చెబుతారు.

అది నిజమో కాదో అని అనుమాన పడే వారికి ఈ తొలి పద్యం అను మాన నివృత్తి చేస్తుంది.

సరసపుటల్క తీర్చు తరి శార్ఙ సుదర్శన నంద కాబ్జ సం
భరణ గుణాప్తి నెన్నడుముపై కటిపై జడపై గళంబుపై
హరి నలుగేలు పైకొని సుఖంబుగ నిచ్చలు నోలనాడు ఇం
దిర కృప చూచు గాత నరదేవ శిఖామణి కృష్ణరాయనిన్

కృష్ణదేవరాయ వర్ణన కృష్ణవర్ణనకు అభిన్నంగా చేసిన తిమ్మన పకడ్బందీగా ప్రయోజనాన్ని ఆశించే ఈ రచన చేసి ఉంటారు.

అటూ ఇటూ ప్రయోజనాన్ని ఆశించాడు. కాబట్టే ఆంధ్ర ప్రబంధాల్లో పరమ సుకుమార మైందని ప్రజలంతా వేనోళ్ళా నుతించారు....

# అయ్యగారి మొగ్గులో! అమ్మగారి సిగ్గులో!!

సంస్కృతంలో మధురభక్తికి, శృంగారానురక్తికి గీత గోవిందం భగవద్గీత. మరి తెలుగులో అలాటిది, క్షేత్రయ్య మువ్వగోపాల పదాలే! ప్రేమ భక్తి ముక్తి రమ్యత! గోపికా కృష్ణుల వియోగజలధిలో ముంచి తీసిన రసవద్గీతలు క్షేత్రయ్య పదాలు-కృష్ణ విరహం కన్నా రాధావిరహమే మధురంగా వుంటుదనేది గీత గోవిందం ఢంకా బకాయించి చెబుతుంది దాన్ని తెలుగు నోటితో చాటేవి క్షేత్రయ్య పదాలు.

అమరుకంలాటి, గాలిబ్ గీతాల్లాటి, ఉమర్ ఖయాం రుబాయిల్లాటి ముక్తకాలు క్షేత్రయ్యపదాలు దేనికవే ఒక శృంగార గాథమయ గాథలు-దేనికది పాడి పరవశించతగ్గది. దేనికదే ఒక శృంగార సర్వస్వం.. ఒక శృంగారం రస పీఠం.

క్షేత్రయ్య పదాల్లో తలమానికంవంటి పదం చూడండి.

మగువ తనకేళికా మందిరము వెడలెన్
వగకాడ మాకంచివరద తెల్లవారెననుచు
పిడజారు గొజ్జంగి విరిదండ జడతోను
కడు చిక్కపడి పెనగు కంట సరితోను
నిడుద కన్నుల దేరు నిదుర మబ్బుతోన

తొదరి పదయుగమున దడబడెదు నడతోను
సొగసి సొగయని వలపు సొలపు జూపు తోను
వగవగల ఘనసార వాసనలతోను
జిగమించు కెమ్మోవి చిగురు కెంపులతోను
సగము కూచముల విదియ చందురుల తోను
తరితీపు సీయు సమసురతి బడలికతోను
యిరుగడల కైదండలిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగోపాల తెల్లవారెనునుచు
మగువ తనకేళికా మందిరము వెడలెన్.

పదసాహిత్యంలో యింతకంటే మంచిపదం వెదికినా మనకు కనిపించ దేమో! పద పదంలో అనుభవ శృంగారాన్ని భావభవజనక పోషకంగా భవ వినాశకంగా పలికించి చివరికి మువ్వ గోపాలుని ముద్దు పేరుతో ముక్తాయిం పైన యింపైన పదం కదూ!

కంచి వరదరాజస్వామి వారి కేళీమందిరంనుంచి మీనాక్షి అమ్మవారు తెలతెలవారే వేళలో శృంగారాంచిత చిహ్నాలతో సుప్రభాత సేవకంటే ముందుగా చెలులతో కలిసి చెలువం మీరేలా వచ్చే సొగసులన్నీ కళ్ళారా చూసిన కవిక్షేత్రజ్ఞ కల్పనా నల్పశిల్పశిఖరం ఇది!

తొలిజాము గడిచాక మలిజాము వేళలో పవళింపు సేవఅయ్యాక చెలులు దించివెళితే స్వామివారే తలుపుతీసి తలపుల సామ్రాజ్యంలోకి వలపుల దేవేరిని ఆహ్వానించారు.

ఆ మీదట అయ్యవారికీ అమ్మవారికీ ఏకాంతంలో ఏకశయ్యా భోగం అమరించి మలిజాము, నడిజాము అయింది. సుప్రభాత సేవకు భక్తగణం వచ్చి అమ్మనూ అయ్యనూ చూస్తే అమ్మగారికెంత సిగ్గు! అందుకే చెలుల ఎచ్చరికతో తెల్లారిపోతుందని చెప్పి బయటికి వచ్చింది మగువ.

ఆమె ఎలావుంది?

రాత్రి చెలులు సింగారించిన విరజాజిదండ జడనుండి విడజారి వేలాడ్తూ వాడి పోయివుంది నిట్టూర్పుల వగల సెగలలో వాడి పోయిందట అది! కంటసరి సరయిన వేడుకవల్ల చిక్కుబడి పోయిందట రేయల్లా నిద్దరమాలి పొద్దు గడిపి నందువల్ల నిద్దురమబ్బునిదుర కన్నుల మీదేవుందట! చెలిమికత్తెల ఎదుటయినా సరే అయ్యవారి మందిరం నుంచి అమ్మగారు రావాలంటే సిగ్గేకదా! అందుకే అడుగులు తడబడ్తున్నాయట. ఇక ఆమెవాలుచూపులు ఎలావున్నాయి వలపు సొగసి సొగయడంతో వలపు సొంపులు చూపుతున్నాయట! రేయి మేల్కొని జాము జాముకూ మధ్య మధ్య సేవించిన కస్తూరి నోరువిప్పి విప్పక నవ్వే నవ్వుల్లోనే వగవగలు చిమ్ముతోందట. కెమ్మోవి తాంబూల రాగంతో జిగి మించింది. ఆ మెరుపులో దంతక్షతాలవల్ల పెదాలు ఓవురు కెంపుల్లా శోభిస్తున్నాయట. నఖక్షతాలు అరచంద మాలలా వున్నాయి—అవి కంచుకం సరిగా లేక, జారడంవల్ల కనిపిస్తున్నాయి. వళ్ళంతా తరితీపులతో అలసిపోయింది వరదరాజస్వామి వారితో నలివిన సమశృంగారంలో ఆమెగారు వడలి బడలిక పొందితే యిరుగడలా చెలులుకైదండలిచ్చి తడబడే అడుగులను బడల్ని సోలనున్న స్థితిలో నడిపిస్తున్నారట-తెల్లవారెనని పరమాత్ముడ్ని ఎచ్చరించి ఆమె బయటికి వచ్చేశాక, బహుశా అయ్యవారు మేలుకొలుపు అయ్యేదాకా సొలసి నిద్రిస్తారేమో!

ఇంతి చక్కగా బొమ్మకట్టేలా పద రచన చేశాడు. క్షేత్రయ్య ప్రతి దానికి యింకెంత కథ రరవత్తరంగా పలుకుతుంది —

ఆయన పలుకుబళ్ళు కూడా అద్భుతంగా వుంటాయి. అనుకూలుడైనట్టి మగవాడు కలిగితే అంతకన్నను సంభ్రమమున్నదా అంటాడు ఓచోట! ఇన్నాళ్ళ వలె కాదమ్మా మువ్వ గోపాలుడెన్ని నేర్చినాడమ్మా అని ఆశ్చర్యపోయినా, ఎంత చక్కనివాడే నాసామి అని కితాబిచ్చినా? ఒక్కసారికే యిలాగైతే ఓహోహో యిదియేటి అని ఎగతాళి చేసినా. కలికిరో యింకొకసారి అని ఆశపడినా, వలచేది

యొకరి కోసమా అని నిర్వేదించినా, ముచ్చట దీరదు మువ్వ గోపాలా అని వేడినా, రమ్మనవే! సముఖాన రాయభారము లేలే అని నిల దీసినా, రామ! రామ! ఈ మేనితో నిక-వాని మోము చూడవలెనా, మొదటి పొందే చాలు అని నిరసించినా సరసిజాక్షి జన్మము సఫలమాయెను అని రసించినా సామాన్యము గాదే వాని పొందూ అని తృప్తించినా చినదాని మనసు లోతులు కచ్చిగా నిక్కచ్చిగా చెప్ప కల్గటం క్షేత్రయ్యకే చెల్లింది.

గంపెడు మధుర పదా(ర్థా)ల్లో ఒకే ఒక పదా(ర్థ)మే ఇంత తీపి అయితే అన్నీ ఆస్వాదిస్తే!

జనులకు విమల విందు....అయితే ఆయనే అన్నట్టు పాయవు పొందు కారి కావలె వాని పద పద్య రచన సేయవలె, వాని ముద్దు కవిత చదువ నేరవలె, అవగలయందు గాయకురాలు కావలె!

# పుట్టలోని కవి రాజ విలాసం

కవిత్వం ఎలా ఉండాలి ?

కప్పుగవలె కప్పురములు కుప్పలుగా పోసినట్లు— కుంకుమ క్రియ విరి పొట్లము విప్పిన గతి - కవిత్వం సభలలో ఘుమ్మనాలి—

అలా చెప్పిందెవరు ?

రఘునాథ నాయకుడు

విజయనగరం వారి సామంతులుగా తంజావూరు కట్టుకున్నందుకు తగినట్టుగా— వాళ్ళలాగే సాహితీ సమరాంగణాల్లో సార్వభౌమత్వం నెరిపారు నాయక రాజులు.

రఘునాథ నాయకుడంటే సామాన్యుడు కాదు. మాన్యుల్లో మాన్యుడు ప్రతి పద్యం చమత్కారం వుండేట్టుగా చెప్పగలిగిన చేమకూర వెంకట కవి అంతటివాడు. "నేరుతునని మాటాడగ వారిజభవు అంతవాని వశమే" తంజావూర్ రఘునాథ నాయకుడు గారెదుటను" అని కుందవరపు కవి చౌడప్ప పొగిడిన కవిరాజు— రాజకవి రఘునాథ భూపాలుడు.

అతడు మహారాజభోగి— దానంలో భోజరాజు అందుకే ఆనతి ఇచ్చినా అది శిలాక్షరం అన్నాడు చేమకూర. అఘటనా ఘటనా చాతుర్య ఘనోర్జిత కార్యనిర్వాహణుడయిన రఘునాథుడ్ని గురించి చెబుతూ.

మాటల నేర్పులా ? సరసమార్గములో కొలువుండు రీతులా ! పాటలు గంధులా ? కళలభాగ్యములా! బహుధాన లీలలా ! నాటకశాలలా ! మొకటనన్ వలదెన్నిట చూడనన్నిటన్ మేటియు కీర్తిలోలుడు జుమీ రఘునాథ నృపాలుడు

అన్నాడు చేమకూర.... మాటలను విరవడంలో తనకు తానేసాటి మేటి అయిన చేమకూర "మాటలు నేర్పులా" అని పొగిడాడంటే కేవలం రాజని పొగిడివుండడు ప్రతిపద చమత్కారం చూసే ఆలా అని ఉంటాడు.

అంతేకాదు. ఆయన పిలిపించి "కృతి చెప్పిమాకింపొనర్చు" అన్నప్పుడు నిజంగా చేమకూర కొంచెం భయపడే ఉంటాడు. ఎందుకంటే తారస పుష్టిమై ప్రతి పదంబున జాతియు వార్తయున్ చమత్కారము అర్థం గౌరవముగల్గ అనేక కృతుల్ ప్రసన్న గంభీరగతి రచించి మహి మించిన వాడికి ఆ రఘునాథ భూపరసి కాగ్రణికి "చెవిసోక చెప్పగ శక్తులెవరయ్యా" అనుకున్నాడు.

అలాటి రఘునాథుడు - ఆటు రణ రంగంలో కాలు కదపక మడమ తిప్పక నిలిచి గెలిచి రణధీరుడై - ఇటు సాహితీ రంగంలో కూడా తలలూచే విధంగా చెప్పాడు-అందుకే తనకై తానే కవిత్వానికి సంబంధించి నిర్వచించాడు. ఇలా "పలుకగవలె నవరసములు వొలుకగా – మాటికి రస పరిపాటికి మేటి కవులు మెచ్చి మేలు మేలనగా" చెప్పాలన్నాడు—చెప్పాడు

ఏదో ఓసారి పొగడ్డం కాదు.

రస పరిపాటికి - మాటి మాటికి – మేటి కవులు మెచ్చుకోవాలట - సభల్లో-విద్వత్సభల్లో మేటి మేటి కవులు మెచ్చేలా రామాయణం చెప్తానన్నాడు.

రాముడి కథ రాశాక - ఆ రాముడి కథ రాసిన వాడికథ కూడా రాయ దగ్గదే అనిపించింది రాజకవికి. దేవతల గురించి పురాణాలు ఉప పురాణాలు ప్రబంధాలు కావ్యాలు నాటకాలు ఎన్నో ఎన్నెన్నో వెలిశాయి. కానీ ఒక "కవి" గురించి "కావ్యం" మాత్రం ఆనాటి నుంచి ఈనాటి దాకా "వాల్మీకి చరిత్రము" ఒక్కటేనేమో !

ఈ వాల్మీకి కథలో కావలసినంత నాటకీయత వుంది. అందుకే "వాల్మీకి చరిత్ర" రాసి ఉంటాడు రఘునాథ నృపాలుడు, రస సింధువైన కవిత చెప్పాడు.

ఇతని ఆస్థానం కళామతల్లికి విస్తృత విహార భూమిగా వుండింది. మంత్రి గోవింద దీక్షితుడు గ్రంధకర్త. ఆయిన కొడుకు యజ్ఞ నారాయణ దీక్షితుడు రఘునాధుని శిష్యుడు ఎన్నో శాస్త్రాలు రచించిన మేటి కృష్ణాధ్వరి ఆస్థాన కవి రాజుగారి ప్రియురాలు మధురాంబ రాజుగారి భార్యకూడా కవయిత్రే - ఆమె రామ భద్రాంబ అష్ట బాషా కవయిత్రి - రఘునాధాభ్యుదయం అనే చారిత్రక గ్రంధం - తన భర్త జీవిత చరిత్ర రాసిన విదుషీమణి—

వీళ్ళే కాదు —

రాజుగారి కుమారుడు విజయ రాఘవ నాయకుడు కూడా కవి — పండితుడు-అతని అస్థానంలోనే రంగాజమ్మ ఉండింది. తండ్రికి తగ్గ తనయుడు విజయ రాఘవుడు.

ఈ కవులు కవయిత్రులు ఒకెత్తు—
చేమకూర వెంకట కవి ఒక్కడూ ఒక్కెత్తు.

విజయ విలాసంతో "నభూతో నభ విష్యతి" అనేలా కీర్తి పొందిన కవీంద్రుడు-బూతు కవిగా పేరు తెచ్చుకున్న కవి చౌడప్ప కూడా రఘునాధుని ఆశ్రితుడే. పదకర్త క్షేత్రయ్య కూడా తంజావూరుని సందర్శించి రాజదర్శనం సన్మానం పొందిన వాడే !

# ఇసుక తిన్నెల వన్నెల వెన్నెల "రా"

పేరువిని భ్రమించి, ఆనందించి, మోజుపడి రచన చేయడం ఈనాడు వింటున్నాం. పేరుపెట్టాక—పెట్టిన పేరుమీద గౌరవంతో రచన చేశారు ఆరుద్ర. శ్రీయుత కాటూరి వెంకటేశ్వరరావు ఏదో సంకలనం చేస్తూ అందులో 'త్వమేవాహం' అనడానికి సినీవాలి ఉటంకిస్తే, దాన్ని సార్థకంచేసి కావ్యంరాశారు ఆరుద్ర.

"కిన్నెర సాని" అని వాగు పేరువినగానే రసించి పరవశించి ఓ అందమైన కథఅల్లి "దాని సంగీతం ఆత్మలోనదిస్తే" అదో చక్కని గేయకావ్యమైంది అది తెలుగు పాటల తీపి అయ్యింది. చిరుతేనెలా, అచ్చరల గొంతులా, గజ్జియల మ్రోతలా నాట్యం చేసింది. తెనుగువారికి ప్రతిపద స్మరణీయమైంది ఒకకవి సమ్రాట్టు, గుండెనుంచి జాలువారి నడి నీటిలో, మెలిఋడ సంధులో నీటి ముడిపొందులో సాగి "తెనుగు వాగై" పారింది తెలిపూల తేనెవాకలు వారగా చేసింది.

"వనములనుదాటి వెన్నెల బయలు దాటి"న కిన్నెరసాని తెనుగు మాగాణాన్ని సస్యశ్యామలం చేసింది తెలుగు దేశాన్ని సంగీతమయం చేసింది. తెలుగువారి నోళ్లల్లో "ముక్తగీతికవోలె మ్రోగింది"....తెలుగు రసికుల గుండెచిను రసాప్లావితం చేసింది ఆనాటినుంచి ఈనాటి దాకా "కిన్నెరసాని" "ఏమి కిన్నెరసాని!" అనిపిస్తోంది. కొబ్బరిపాలు వాకలు కట్టిస్తోంది.

ఇంతగా అలరించేదుకు అందులోఏముంది? "అందరు తెలుగు కన్నెల మల్లేనే ఉద్విగ్న హృదయ కిన్నెర ఎక్కువ తెలుగు కుటుంబాల్లో సామాన్యమైన అత్తా కోడళ్ళ పోరాటం ఆ ఇంట్లోనూ వెలసింది. కొడుకు సుఖమెరుగని

అత్తకు కిన్నెరమీద నిందలారోపించటం పని అయ్యింది. ఒకప్పుడు ఆవిడ చేసిన నింద భరించడం మహా పతివ్రత అయిన కిన్నెరకు కష్టమైంది. కిన్నెర హృదయం శోకం చేత ప్రళయ సముద్రం అయింది"—

కరిగి నీరై వాగై ప్రవహించింది తల్లిని కాదని లేని, భార్యను
ఓదార్చలేని కిన్నెర భర్త శోకించి శోకించి శిల అయినాడు....

సర్వజన సామాన్యమైన సమ్మాన్యమైన కథకాబట్టి కిన్నెరసాని పాటలు ఇంకా తెలుగు గొంతుల్లో పలుకుతూ ప్రతిధ్వనిస్తున్నాయి.

ఓహో కిన్నెరసానీ !
ఓహో కిన్నెరసానీ
ఊహమాత్రమ్ములోపల
నేం నిలువవే జవరాలా

అంటూ భార్య వంట పరిగెత్తి పరిగెత్తి ఆమె రాళ్ళవెంట పరిగెడుతూ వుంటే "రాలపైన తొలినాటల, కాలిడిగా నోర్వలేవు. రాలను కొండలగుట్టల నేలా ప్రవహించెదవో" అని కుమిలిపోయిన భర్తవ్యథారగాథ ఇది.

"నీవు మహా పతిశీలవు కావని నేనంటి నంటే. అనికుమిలి కుమిలి యేడిచి కంఠము సన్నవడిన భర్త నిర్నిద్రరోదనాగానమిది.

ఒడలెరుగకుండా రోదించి రోదించి "రాయివోలె అయిపోయిన నాథుని కథ" ఇది

అతనికి భార్యంటే ఎంత ప్రేమో ! ఎడమ చేతికొంగును ఒడిచి పట్టుకొని—ఆమెనీరైతే "తడిచేతను కొంగు లేక తడబడిన" ప్రియుడతను ! ఆమెకన్నులు మీనాకృతి; అందుకే ఆమెకనులు చూసి ఆమెను నదీమానుషజన్మగా భావించిన భావుకు డతడు ! పెళ్ళామంటే చెప్పలేనంత ప్రేమ ! ఆమెపాదాలు ఫాలాన మోచిన రసికుడు.

అక్కడ చెమ్మటను వాగైన ఆమెపై ప్రేమ తలపోసి వెతల నందిన దుఃఖితుడు !

ఇంత కోపమేమిటికే
ఇంత పంత మేమిటికే
ఇంతులు జగమున పతులకు
ఇంతలు సేయుదురటవే

అని నిష్ఠురమాడిన నిర్మల హృదయుడు. కరిగి నీరైనా - ఆ ఓన్ని తరగల చాలులో ఆమె మేని పసందులు వెన్నెలవలె కన్నులకు కనిపించాయని మురిశాడు.

ఆమె నవ్వులు పెరుగులుగా ఆమె వళులు తరగలుగా అను కన్నులు మీనులుగా అయ్యాయని ఊహించాడు. ఆమె జఘనాన్ని ఇసుక తిన్నెగా చూసిన తన కన్నులు నేలమీద ఊడిపడలేదని - లోలోనే ఉరిసి పోయాయని కుమిలిన దుఃఖార్తుడు.

వర్ణించడంలో కవులు స్త్రీల జఘనాన్ని ఇసుక తిన్నెలలో పోల్చడం సంప్రదాయం. కానీ ఇక్కడో ! ఏ స్త్రీ అయితే తన కన్నుల పండువుగా తన జీవిత సర్వస్వంగా తన జీవన దీపంగా వుండిందో ఆమె నదిగా మారింది ! అప్పుడామె కన్నులు చేపలయ్యాయి. నవ్వులు నురగలయ్యాయి. వళులు తరగ లయ్యాయి. జఘనం ఇసుక తిన్నె అయ్యింది. ఆహా విశ్వనాధుల సృష్టి ! "అనుభవ రసికో విజానాతి ."

ఇక ఆ కిన్నెర నడక ఆమె నృత్యం సంగీతం ఎంత గొప్పగా వుందో పొంగిన కడలికి తెలుసు ఉప్పొంగిన ఆ జడధిని చూసి దుఃఖించిన కిన్నెరకు తెలుసు ఓ దార్చిన గోదావరికి తెలుసు ఆమీద కెన్నెర వైభవం! అదెలాంటిది?

# కలి "ఆలి" గోల

వినండయ్యా! జనులారా వినండి! దేశాంతర ద్వీపాంతర కాలాంతరాల్లో ఆత్మకర్మ ఫలాన్ని అనుభవిస్తుందనేమాట అబద్ధం! వేదం ప్రమాణం కాదయ్యా! వేదాన్ని ఖండించి బోధి సత్వుడు ఈ ప్రపంచం అస్థిరమని చెప్పాడు! బుద్ధిలేని వాళ్లు, పౌరుషం లేనివాళ్లు ఆచరించేది వేద ధర్మం. వాళ్ళే అగ్నిహోత్రాన్ని త్రిదండాన్ని స్వీకరిస్తారు!

నామాట వరలమూట! వినండి! స్వేచ్ఛే ధర్మం! మన్మధుడే దైవం! చావు ఒక్కటే చివరి గమ్యం. చచ్చాక తిరిగి రావడం అనేది అబద్ధం చచ్చి, బూడిదై తిరిగొస్తామనేది భ్రాంతి.

వినండయ్యా! వినండి! ఇంద్రుడికంటే పెద్ద దేవుడున్నాడా! అతడు వంద యజ్ఞాలు చేశాడు. అతడు అహల్య కోసం పడిన పాట్లు పొందిన దెబ్బలు తెలియవామీకు! అతడలా కష్టపడినా అహల్య కోసం వెంపర్లాడడం ఇతర్లని ఇచ్చానుసారం జారత్వం చెయ్యమని అనుజ్ఞ ఇవ్వడం కాదా? ఆలోచించండి!

ఈ విధంగా కవి భటులు విపరీతవాదం చేస్తూ వస్తున్నారు! వినేవాళ్ళంతా విభ్రాంతిపాలై నిలబడి పోయారు. అది చూసి ఇంకా రెచ్చిపోయి—

"చెక్కిన రాతి బొమ్మల మీద పూలేసి పూజచేసి ఫలం వస్తుందని ఆశపడుతున్నారు. దాన్నెలా నమ్మడం! ఓ భక్తులారా! ఆలోచించండి! చెట్టు మీంచి ఎప్పుడైతే పూవుకోస్తామో అప్పుడే దానికి ఫలించే అవకాశంపోతుంది కదా! ఇకపూల పూజవల్ల ఎలా ఫలాలొస్తాయి!

అయ్యా! మనశాస్త్రాలు చెప్పేది వేరు. వేదాలు వర్ణించేది ఇంకొక తీరు. ఉపనిషత్తుల మార్గం వేరు బురదలోని స్తంభం లాంటిది. తర్కం— మీ పారాయణ మంత్రార్థాలు వేరు. సాంఖ్యయోగ సిద్ధాంతం వేరు. వీటితో ఎందుకు ఛస్తారు కష్టం లేని సుఖం దక్కే-మార్గం ఎన్నుకోండి"

అని బోధించారు-ఆమీదట ఆగకుండా పెచ్చుమీరి ఢంకా బజాయించి తమ "సిద్ధాంతము" వ్రసాగారు.

"వినండి! బాగా వినండి! ఈ దేహం ఆఖరికి మంటల్లోపడి బూడిదై పోయేదే కాదా! ఇంకాపాపం ఎలా మిగిలి ఉంటుంది! ఈ శరీరంతో చేసిన పాపాలు ఈ శరీరంతోనే పోతాయి నమ్మండి! కాబట్టి పరమ సుఖానిచ్చే పరస్త్రీ సంగమాన్ని స్వీకరించండి! ఓపికున్నంత వరకు చేతనయినన్ని పాపాలు చెయ్యండి!"

ఇవన్నీ ఎందుకోసం అంటారా?

మీరు బాగా ఉన్న దేవతలేం చేశారు. కర్ణుడిచర్మం వొలిచి-కవచాన్ని తీసుకున్నారా లేదా? దధీచి ఎముక లేరుకున్నారా లేదా? బలిని పాతాళానికి తొక్కేశారా లేదా? జీమూతా వాహనుడి ప్రాణాలు తీశారు లేదా? శిబి కథేమిటి? సముద్రాన్ని ఎలా చిలికారు? చంద్రుడ్నెలా తినేశారు? కల్పవృక్షం మాటేమిటి? దేవతలు ఎంతకయినా తగిన వాళ్ళు! వాళ్ళ నీతుల కతలు మనకొద్దు—"

ఇలా విజృంభించి కలిభటులు దూరాచారాన్ని సమర్థిస్తూ సదాచారాన్ని ఖండిస్తూ, వేదాన్ని నిందిస్తూ స్వేచ్ఛని అభినందిస్తూ వస్తూఉన్నారు. అది చూసిన దేవతలకు ఒళ్లు మండిపోయింది.

వాళ్ళు నలుగురు.-ఇంద్రుడు - యముడు - వరుణుడు-అగ్ని - వాళ్ళు నలుగురూ దమయంతీ స్వయంవరానికి వెళ్ళి-నలుడిని దూతగా పంపించి—చివరికి దమయంతి నలుడినే వరిస్తే ఆశీర్వదించి తిరిగొస్తూఉంటే వాళ్ళకు ఎదురయ్యారు కలిబంట్లు-వాళ్ళని చూడనే చూసిన నలుగురు దేవతలూ చివాట్లు పెడితే "అయ్యలారా! మారాజు కలి? మేం అతని కైవారాలు ఇలా చెప్పాలి లేకపోతే మాపై ఆగ్రహిస్తారు. మేం పరాధీనులం. చెయ్యమన్నట్టు చేసే బంట్లం మమ్మల్ని మన్నించండి!" అని చేతులు జోడించారు.

అప్పుడు కాకి కేతనంతో కాలాసనంతేరులో నల్లని శరీరంతో నిగనిగలాడ్తూ వచ్చాడు కలిపురుషుడు. వాళ్ళని చూసి పలకరించి, నమస్కరించి తాను దమయంతీ స్వయంవరానికి వెళ్తున్నానని ఆశీర్వదించి పంపండని కోరాడు కలి!

అదివిని "అదేంటయ్యా!! నిన్ను బ్రహ్మ బ్రహ్మచారిగా చేశాడుకదా! పెళ్ళంటా వేటి? అయినా దమయంతికి నలుడితో పెళ్లైపోయింది కదా! మేం ఇప్పుడక్కడినుంచే వస్తున్నాం! ఆ దమయంతి నాగులను పరిత్యజించింది. వేల్పుల ధిక్కరించింది రాజులను తిరస్కరించింది. నలుడిని వరించింది.

ఏం చేస్తాం! ఈశ్వరాజ్ఞ బలీయసి మాతోపాటే తిరిగి పోదాం రా! అన్నారు నలుగురూ!

అదివిన్న కలి భగ్గుమన్నాడు.

"బ్రహ్మకేం? మీకేం మీకంతా భార్యలు ఉన్నారు. మీరు సుఖపడ్తున్నారు? నైష్ఠిక బ్రహ్మచర్యంలో నేను చెడితే చెడతాను మీకేమిటి? మీ సుఖాలకు ఏంలోటు లేదుకదా!

ఆమె మిమ్మలందర్నీ కాదని-ఒక మానవుడ్ని వరిస్తూవుంటే ఎలా ఊరుకున్నారు? ఇదంతా వదిలెయ్యండి! నేవెళ్ళి ఆమెను ఎత్తుకొస్తాను. పాకశాసనుడు (ఇంద్రుడు) పావకుడు అగ్ని.) పరేతపతి (యమధర్మరాజు), పాశహస్తుడు (వరుణుడు) పంచముడ నేను (నేను)—మనం ఈ అయిదుగురం కలిసి-పాండవులు ద్రౌపదిని పంచుకున్నట్లు పంచుకొని అనుభవిద్దాం! అన్నాడు కలి.

ఆ మాటలు విని నలుగురూ ఛీ ! ఛీ ! అని చివాట్లు పెట్టారు. నలుడి ధర్మ నిరతిని పొగిడారు.

అప్పుడు కలి వాళ్ళకు నమస్కరించి తానెలాగయినా కొన్నాళ్ళు భూమ్మీద వుండిపోయి ఆరాజ్యంలో ఎవడో ఒకడు తప్పుచేస్తే తానువాడిలో దూరిపోయి - ఆరకంగా - ప్రజల తప్పు రాజుదేకాబట్టి - రాజును పట్టి పీడిస్తానని వెళ్ళిపోయాడు.

హర్షనైషధాన్ని ఆంధ్రీకరించిన శ్రీనాథుడు శృంగార నైషధంలో కలి చేష్టల్ని, కలిబుద్ధిని, కలివిజృంభణాన్ని ఎంతో చక్కగా చెప్పాడు.

# అమ్మా .... నువ్వింత వాడివా బ్రహ్మా

మానవుల జీవిత విశేషాలను భవిష్యత్తును యోగాన్ని చెప్పేది జ్యోతి శ్శాస్త్రం. ఆ జాతకం చెప్పడానికి జాతక చక్రం కావాలి. ఆ జాతక చక్రం తయారు చేసేందుకు లగ్న నిర్ణయం-అందుకు పుట్టిన సమయం కావాలి. పుట్టిన సమయాన్ని బట్టి మానవుల భూత భవిష్యత్ వర్తమాన విషయాలు చెప్పగలరు. జాతకాన్ని నిశితంగా పరిశీలించి ఫలితాలు చెప్పడంలో శాస్త్రవేత్త పొరపాటు పడవచ్చునేమో కానీ శాస్త్రం తప్పుకాదు. జన్మ కాలాన్ని బట్టి ఆధానలగ్నం నిర్ణయిస్తారు అంటే మానవుడు మాతృ గర్భంలో నిక్షిప్తమైన సమయం. ఏతావాతా తేలిందేమిటంటే స్త్రీ పురుషుల కలయికకు కూడా మంచి సమయం కావాలి. పుత్ర యజ్ఞమది ఆవేశం ఫలితంగా పుట్టే సంతానం ఏలా వుంటుందో శ్రీకాళహస్తి మాహాత్మ్యం చెబుతుంది. నమ్మినా నమ్మక పోయినా కలయిక సమ యంలో భార్యాభర్తల చిత్త వృత్తులు సంతానానికి వస్తాయి. నేడు జన్యు శాస్త్ర వేత్తలు కూడా ఇదే నిర్ణయిస్తారు.

శ్రీకాళహస్తి మాహాత్మ్య కథ చూద్దాం—

ఒకప్పుడు సృష్టికర్త-అయిన బ్రహ్మకు సృష్టి కార్యం మీద విపరీత మైన వాంఛ పుట్టుకొచ్చిందట అందుకని భార్య సరస్వతితో "నా వాంఛ చాపల్యం తీరాలంటే నువ్వు నూరు రూపాలు దాల్చాలి. నువ్వలా వంద సరస్వ తులుగా రూపాంతరం చెందితే నేను శతానందుడిని అవుతా!" అని అడిగాడు. అలాగే సరస్వతి వంద "భాషాయోష" ల రూపం ధరించింది.

బ్రహ్మ బ్రహ్మానంద భరితుడయినారు.

ఇళ్ళల్లో-కొండ చరియాల్లో, మేడలమీద, నదీ తీరాల్లో, పూపొదరిళ్ళలో, దేశం, కాలం సమయం, అసమయం అనే విషయాలు మరచి కామాంధుడై కోరిక

తీరాలా తిరిగేడు. అరవై గడియలు రతి ఆనందంతో గడిపేశాడు. పుణ్యం, పాపం అనుకోకుండా అదే పనిగా కామలోలుడయ్యాడు.

ఫలితంగా —

ఆయనకి ముప్పయి వేలమంది రాక్షసులు పుట్టుకొచ్చారు. వాళ్ళంతా క్రూరులు. ధూర్తులు దోషులు, జగత్ ద్రోహులు, మహా భయంకరులు, ధర్మ విరోధులు, పరస్త్రీ సుఖలాలసులు, ఆచార భ్రష్టులు, లోక కంటకులు, నిర్దయులు. పుట్టీ పుట్టగానే తమ పుట్టుకకు కారకుడైన సృష్టికర్త వద్దకు వెళ్ళారు. మొక్కారు. " ప్రజా పతీ! చెప్పండి, శ్రీ మహాలక్ష్మిని చెరపట్టి తెమ్మంటారా? వెండి కొండను పిండి చెయ్యమంటారా ? సూర్యుడ్ని మింగమంటారా ? సముద్రాలను పీల్చ మంటారా ? శేష శాయిని ఒక ఆట ఆడించమంటారా ? భూమిని పెకిలించ మంటారా ? మృత్యు కోరలు విరగదన్న మంటారా ? యముడ్ని పారదోలాలా? ఏడు కొండలూ పై కెగరవేసి బంతాట ఆడుకోమంటారా?" అని అడిగారు.

ఒక్కో యుగంలో ఒక్కో రాక్షసుడు ఒక్కో దుర్మార్గం చేశాడు. హిరణ్యాక్షుడు భూమిని పెకిలించాడు. వరాహ రూపంతో దాన్ని విష్ణువు ఆపేడు.. ఆలా ఒక్కొక్కరి కోసం విష్ణువు ఒక్కో అవతారం ఎత్తాల్సి వచ్చింది.

మరి వీళ్లో !
అవన్నీ తామే చేస్తాం అంటున్నారు.
వీళ్ళను చంపి లోకాల్ని రక్షించాలంటే !

అంతా విన్న బ్రహ్మ నాలుగు తలలు పట్టుకున్నాడు. "హత విధీ !" అనుకున్నాడు. కళ్ళకు కావరం కమ్మి కామాంధ కారంతో చెరలాడినందులకు ఈ చేటు అనుకుని - తన పనికి తానే వగచి — అందర్నీ వింధ్యకు పొమ్మని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు అమిత ఉత్సాహంతో వెళ్ళారు అక్కడ —

జంతువులను చంపారు. మింగారు. ఋషి పత్నులను చెరపట్టారు దేవతల నగరాలను ముట్టడించారు. మునుల తపస్సు చెడగొట్టారు. పురుషుడెదురైతే చంపేవాళ్ళు.

స్త్రీ ఎదురైతే చెరిచే వాళ్ళు. సంపదలు దోచేవాళ్ళు లోకంలో సుఖ శాంతులు లేకుండా చేశారు. చేస్తే —

భూదేవి వెళ్ళి మొర పెట్టుకుంది.

అది విని బ్రహ్మ కోపించాడు. ఆ కోపంలోంచి "ఉగ్రుడు" అనే వీరుడు పుట్టుకొచ్చాడు. అతడికి ఉగ్రసింహ రథాన్నీ, అస్త్రాలను, శస్త్రాలను, వజ్ర కవచాన్ని ఇచ్చి - "కుమారా! యుద్ధంతో ఆ ముప్పై వేల మందినీ చంపెయ్, నా కొడుకులు అనుకోవద్దు. నీ అన్నలు అని సంకోచించవద్దు—వాళ్ళు లోక కంటకులు. వాళ్ళవల్ల లోకాలన్నీ తల కిందులవుతున్నాయి. వెళ్ళు చంపిరా!" అని పంపాడు.

వాళ్ళతో యుద్ధంచేసి అందర్ని చంపి తిరగొచ్చి తండ్రి ఎదుట నిలిచాడు ఉగ్రుడు.

ఆ కొడుకుల దుష్ట వర్తనం ఈ కొడుకు వాళ్ళను చంపడం అంతా మనసులో మెదిలి బ్రహ్మ మనస్సులో కోపం పుట్టింది మళ్ళీ. ఆ క్రోధంలో ఉగ్రుడూ భస్మమయ్యాడు.

కొడుకులు పోవడం - పుత్ర హత్యా దోషం చుట్టు కోవడంతో శివుడి గూర్చి తపస్సు చేశాడు బ్రహ్మ -

కథ అంతే అయినా — గమనించాల్సింది - సంతాన కారణం ఆ సమయంలో తల్లి దండ్రుల మన స్స్వతం.... తత్ఫలితం

# కోమలి అందెల రవళి

అడవిలో చిరుపాయలై వాకలై సోనలై జాలులై సాగిన కిన్నెర నృత్యం దివ్య నిస్వనంతో దిక్ దిగంతాల నంటింది. అపూర్వ రీతిలో "జిగిబిక్కులా ధగాధగతళుక్కులా జగాజిగికులుక్కులా కిన్నెర బిగువుటందాలతో నగవుటందాలతో నిండుగా ప్రవహించింది. అలా తెలిపూల తేనెవాకలు పారే రీతిగా తెనుగు వాగై పారింది. కిన్నెర అందాల రాకతో బంగారు జిలుగు గంటలు మోగాయి అవి తేనెలై కలకండ సోనలై వానలై కోకిల గొంతులో కదలాడాయి. కిన్నెరపాట అందః త్తెల జిలుగు అందియలు మ్రోసినట్లు జిలుగులు పోయింది. ఇదంతా చూసి పొంగిపోయాడు కడలిరాజు.

అతనికి గాలి పిల్లితె పోయి ఊదాయో ? మొగిలు కన్నెలు పోయి చెప్పాయో 'కాని ఆయనకి కిన్నెరసాని అందచందాలు చూడాలనిపించి మిర్రెక్కి చూశాడు. కోరికతో తట పటాయి పోయి తపియించి పోయాడు. పాపం ! అతనిలో నీటి గుణం ఏమైందో— చల్లదనమేమయిందో ! ఈ విరహాగ్ని పాలు కావడం అతనికి తగునా ? గంగతన ఇల్లాలు కాదా ? యమున తన ఇల్లాలు కాదా ?" ఇంకా ఎంత మంది లేరు ? ఇన్నేళ్ళు వచ్చి— నా (ఏళ్ళంటే వయస్సని— ఏరులని కూడా చమత్కారం కదా !) 'ఇంతచిన్న వాగును చూచి చిత్తం తతరపడడం తగునా.'

ఈ ముసలి కడలి.... నలుగుర్లో తిరగనేర్చిన పెద్ద - కామానికి లొంగి—తన "మర్యాద" తప్పితే – లోకాలు తప్పు చేస్తే సర్ది చెప్పగల సామంతుడు తానుగా తప్పుదారులకు దిగునా ? ఆడితగున్నా? తను ఆశిస్తే మాత్రం ఆ

•కిన్నెరసాన్ని తన్ను పొందుతుందా ? తనకు దక్కుతుందా ? వాగుగా అయ్యాక జలజలా బిల బిలా ప్రవహించి తన కౌగిట్లో దూరుతుందని భ్రమిం చడం - పొంగి పోవడంతగునా ? ఆమిడిసిపాటు చూసి జగాలన్నీ కళవళ పడ్డాయికానీ ఎలా పొంగిన కడలి అలాగే నిలిచిపోయింది. ఒక నీటిబొట్టు యినా పొంగి రాలేదు. అదిచూచిన జనానికి భయం పోయింది ! దాంతో పిచ్చిగా అనుకున్నారు కడలిపొంగింది ! కడలి ఉబికింది అంతే కానీ కడలి చలియలి కట్ట దాటుతుందా అనుకన్నారు.

ఆకడలి రాజు ఉలికిపాటు. ఉద్రేకం, పెంగిపోవడం, చూసిన కిన్నెర మనసులో పెద్ద దిగులు పుట్టింది ముందుకు సాగిపోతే ఆరాజు ఐక్యంకాక తప్ప దని ఆగాలని నీరుగడ్డ కట్టించుకోవాలని ఎంతో తలపోసింది. ఎంతో వగచింది. ఏడ్చింది. రాయడ్డంచేసి నిలిచింది. పొదలడ్డం పోయింది కానీ నీటి గుణాను గుణంగా కదలిపోయింది. జల జలా బిల బిలా దుఃఖం ఆపుకోలేక హో అని ఏడ్చింది. తనలో అంతర్మథనం సాగించి. ముక్కనో మొక్కనో అయితే ఈ బాధ వుండేది కాదని బాధ పడింది. తనుసీ-కడలని గూర్చి తర్కించుకుంది అంతగా ఏడ్చిన ఏడ్పులకు నీళ్ళన్ని ఎర్రగా అయినా. తనువు నల్లనయి, నురు గులు తెల్లనై నడకలు వేగమై ఏడ్చింది. ఆదుఃఖంచూసి పులులు మృగాలు వచ్చాయి ఓదార్చాలని వచ్చి అవీ ఏడ్చేశాయి. అలా అలా ఏడ్పులు సాగి సాగి, మోగి మోగి గోదావరిని చేరితే ఆమె పొంగివచ్చింది అభయమిచ్చింది వారి సంగమం అద్భుతం అపూర్వం.

అప్పుడొచ్చింది కిన్నెరకు వైభవం. రుతువు రుతువు మారే రుచులతో కారు కారునమారే కాంతితో కిన్నెర చవులూరితే అది తెలుగు సత్కవిరాజు పలు కందుకోలేని చవులయింది. ఆమె సోయగం ఆమె నడక నల్లతాచులుదూకి నాట్య మాడినట్లుంటుంది. చివరికి నిర్మలంగా ప్రశాంతంగా తెలుగు యాత్రికులకు తెలుగుదైవము భద్రాది రామయ్య దర్శనం చేసే యాత్రికులకు-ఆచల్లని నీడ అందిస్తోంది. పుతాత్మ కిన్నెర భద్రాద్రి తోవను కాస్తోంది.

ఇది ఒక అచ్చమయిన తెలుగు కవి. స్వచ్ఛమైన తెలుగు కవితా మార్గం.... ఇందులో అట్టహాసం లేదు. ఆడంబరం లేదు. ఎక్కడో తప్ప పదాడంబరం లేనేలేదు- "మున్ను భగీరథ భూపతి వెన్ను వెంట పరుగెత్తిన అన్నాక ఘునీ వైఖరి.... ఇక్కడ ఓ పదం. ఈ తరగల కదలికలో ఓ తరుణీ నీ కంఠ శ్రీతారుణ్యం... ఇక్కడో మాట గోదావరీ మహా కూలంక షామృత శ్రీ దివ్య మధు తరంగాలు......... ఇక్కడో వాక్యం......... మండు ఎండలుగాసి మాడ్చినది గ్రీష్మమ్ము. కొండ అంచులనుండి కురిసినది ఊష్మమ్ము.... ఇక్కడో అద్భుత ప్రాస.... శైవాభిషేక రంజన్నారి కేళ గర్భాంబువుల్ అక్కడో సమాసం.... ఇలా వెతికితే పట్టుమని అయిదో పదో దాటని కవిత్వపు పోకడలు తప్ప—అంటే కథా గానంలో లీనమై కవి గానంచేస్తూ వుంటే మధ్య మధ్య కవి విశ్వనాథను కాదని పండిత విశ్వనాథ కనిపించే చోట్ల తప్ప మిగతా అంతా ద్రాక్షా పాక కవిత్వమే! ఎవరూ ఏడవాలని ఏడవరు. ఏడుపు నటిస్తారేమో తప్ప గుండె గుబులు బుగులు మంటే కాని కంట్లో నీరు వాగై కురియదు. కవితా అంతే! గుండె కదిలి పదం ప్రిదిలి పద్యం కుదరాలి. అంతా కవితామయమే తప్ప పదాడంబరం పాండిత్యా డంబరం వుండనే వుండదు. భావ ప్రవాహం మెల్లనయితే నో - ఊహకంటే వాక్కు వెనుక పడితేనో తప్ప కవి ప్రౌఢి తెలిసే పదం పడదు... —

భావావేశం ప్రారంభ దశ కాబట్టి ఇదిగో చేతుల చాచితి ఏడ్చుచుంటి కంఠమెత్తి అన్నాడు కవి. ఈ నడకలో ఒక లయవుంది ఒక గుణంతో పాటు గణమూ ఉంది. కానీ దుఃఖావేశం తగ్గాక వచ్చింది అసలయిన కవిత. అది కిన్నెర నడకల్లో అడుగడున కన్పిస్తుంది. 'నీలి మబ్బుల బోలు నిడివి నీచేతుల్లో నన్నింక కౌగిలించగా రావు కాబోలు కడు ప్రేమగా చేరగా లేవు కాబోలు మెమ్మదిగా నా యేదల్ నిమరవు కాబోలు.... ఇందులో కవిత వుందా కథ ఉందా? బాధవుందా అన్నట్టు కిన్నెర భర్త - వల్లనయ్యో కాబోలు - కాకపోతే నీలి మబ్బుల బోలు అని చేతుల రంగు చెప్పదు కదా! తెల్లని - ఎంత తెల్లని?

తొలి వెన్నెల చిప్పళ్ళ తెలినిగ్గు విరజిమ్ము వెలది - కిన్నెరకూ నల్లని ఆమె భర్తకూ సఖ్యం ప్రధానం అయ్యింది. కానీ రంగు ముఖ్యం కాలేదు. బహుశా ఈ రంగుల తేడా కూడా కిన్నెర అత్త ఆరళ్ళకు ఒక కారణము అయ్యిందేమో !

కిన్నెరసాని పాటలు నిజంగా తేనెలై కలకండ సోనలై వానలై తెలుగు దేశాన్ని రసింప జేస్తూనే ఉన్నాయి. కల్ప వృక్షానికి ఆ మహా రామాయణ గాథకు జ్ఞాన పీఠ బహుమతి వస్తే వచ్చుగాక – కిన్నెరసాని పాటల్లోని కవిత్వం నిజంగా నోబుల్ బహుమతి రాదగింది.

దీని జతకత్తె కోకిలమ్మ పెళ్ళి గురించి మరోసారి.

# శృంగార బంగార శ్రీనాథం

ఆయన మహాకవి. త్రిమూర్తుల్లో బ్రహ్మ, శివుడికంటే విష్ణువు ప్రపంచవృద్ధికి ఎలా కర్తయ్యాడో-అలాగే తెలుగు సాహిత్యానికి ఆయన శ్రీ మహా విష్ణువు. అతడే శ్రీనాధుడు.

తెలుగు సాహిత్యాన్ని తేజోమంతం చేసే కావ్యాలు శృంగార నైషధం, కాశీఖండం, హరవిలాసం, భీమేశ్వర పురాణం, శివరాత్రి మాహాత్మ్యం (క్రీడాభి రామం) రాసినా తెలుగువారికి బాగా తేట తెల్లగా ఉండి చల్లగా పాడుకునేందుకు-తెలుగువారికి తెలుగు చందస్సు ద్విపదలో రాసిన మహాకావ్యం పల్నాటి వీర చరిత్ర.

శ్రీనాధుడు కొండవీటిరెడ్ల ఆస్థానం చేరినతరువాత (చేరకముందు కూడా దేశద్రిమ్మరే) వివిధ ప్రదేశాలు చూశాడు. వివిధ రాజస్థానాలు చూశాడు అక్కడి కవులతో వాగ్యుద్ధాలు, సంవాదాలు, చర్చలు చేశాడు. ఊరూరు తిరుగుతూ వర్ణనలతో స్త్రీలను రూపు కట్టించాడు. ఆయన సాహిత్యం ఎంత విలువైందో-ఆయన చెప్పిన చాటువులు అంత విలువైనవి. కావ్యాలు దేశచరిత్రను కొంతే చెబుతాయి. కాని చాటువులు చెప్పే చరిత్రని సాంఘిక వ్యవస్థని అవి కళ్ళకు కట్టినట్టుగా నాటి దేశకాలమాన పరిస్థితుల్ని చెబుతాయి. శిలాశాసనాల కన్న స్పష్టంగా రాజశాసనాలకన్నా సూటిగా చెపుతాయి

ఆయన అలా తిరుగాడే రోజుల్లో పలనాడు వెళ్ళాడు అప్పుడు ఎన్నో అనుభవాలు ఎన్నో ఆనందాలు అన్నిటికీ అన్ని పద్యాలు-మంచినీళ్ళు దొరకపోతే సిరిగలవారికి చెల్లును తరుణుల పదియారువేల తగ పెండ్లాడన్ తిరిపెమున కిద్ద రాండ్రా! ..... పరమేశా గంగ విడవు పార్వతి చాలున్.

శివుడి నెత్తిమీద గంగమ్మ దిగొస్తేతప్ప నీరుపుట్టని దేశం అది. రాజుల, రారాజుల, మహారాజుల, మహామంత్రుల సరసన మహారాజభోగం అనుభవించాడు. విస్సనమంత్రి స్వర్గస్థుడయ్యాడని హేమపాత్రాన్నము ఎవని పంక్తిలో కలదని

బాధపడిన భోగి అప్సరోభామిని వక్షోజద్వయ కుంభికుంభాలపై కస్తూరి వాసనలు చిమ్మడానికి కస్తూరి భిక్షవేడిన మహాభోగి, అలాటివాడు - భోజన సమయంలో జొన్నకలి, జొన్నము, జొన్న అంబలి, జొన్న పిసరు, జొన్నలేతప్ప సన్నన్నం మాచేలేకపోతే ఎలా తినగలడు.

ఇక అడుక్కో ఊరు వ్యాఘ్రనగరం (పులిపాడు) ఉరగంబు (నాగయో! శేషయ్యో)! కరణం, కాపు కపివరుడు (హనుమయ్యో, అంజనేయులో) కసపు (పుల్లిగాడు నేడు...అలాటిచోట ఇలాంటి కవికి ఏం మర్యాదలు జరిగి ఉంటాయి. అందుకే నోరు తీరా తిట్టేశాడు.

అలా తిరుగుతూఉంటే కారెంపూడి వచ్చాడు.

అక్కడ—

వీరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుడు కల్లిపోతరా
జారయ భైరవుండు తుహినాద్రి జయాంకము నిర్మలాంబులై
కేరెడు గంధగార మదుగే మణి కర్ణిక యన్ని రీతులన్
కారెమపూడి పట్టణము కాశిగదా పలనాటి వారికిన్

అంతగా ప్రస్తుతించాడు కాబట్టే మనకు పలనాటి చరిత్ర పాడి పోయాడు.

భారతానికి ఎంత ప్రశస్తి, ప్రకాస్తి ఉందో పలనాటి భారతానికి అంతే ప్రశస్తి, ప్రకాస్తి ఉంది. భారతంలో అభిమన్యుడికి ఎంత ప్రాముఖ్యత ఉందో. పల్నాటి చరిత్రలో బాలచంద్రుడికి అంతే ప్రాముఖ్యత ఉంది. అది చదువుతూ ఎంత పొంగిపోతారో ఇది వింటూ అంతే పొంగిపోతారు జనం! భారతంలో .అశ్వద్ధామ అగ్రతః చతురోవేదాః పృష్ఠతః సశరం ధనుః

ఇదంబ్రాహ్మ్య మిదం క్షాత్రం శాపాదపి శరాదపి అని ఉన్నట్టుగా ఇందులో ఈ పల్నాటి వీర భారతంలో అనపోతుఉన్నాడు. అది ఎలా ప్రత్యక్షర రసార్ణవమో ఇదీ అలా ప్రతి పద రసోదయం.

అన్ని కావ్యాలు రాసి, అన్ని చాటువులు చెప్పి అఖిలాంధ్రావళి మోదం వడసిన కవి సార్వభౌముడికి - ఈ చిన్నద్విపద రచన ఎందుకు చేయాలన్పించింది; చేసింది చాలకా ? తృప్తి లేకా ? విషయపరిపూర్ణత విశిష్టత కారణమా? రణమా ?

మాచర్ల చెన్న కేశవుడు కలలో కన్పించి శౌర్యంబు పుణ్యంబు సమ కూర్చిపెట్టి పలనాటి వీరుల భాగవతం' అంకితం ఇమ్మన్నాడు. దానికి కవిగారు పలనాటి వీరుల చరిత జనులెల్ల భక్తిచే చదువుట కొరకు మంజరిద్విపదగా .... వచః శ్రీ మెరయగ చెప్పబూనాడు,

దేవుడు పలనాటి వీరుల భాగవతం అన్నా అందరూ దీన్ని భారతం తోటీ పోల్చారు మరి !

ఇంతకూ భారత యుద్ధానికి ఏదోరీతిగా ద్రౌపది కారణం అయినట్లుగా ఈ పల్నాటి యుద్ధానికి కారణం నాగమ్మనే నాయకురాలు - అటు బ్రహ్మనాయుడు ఇటు నాగమ్మగా రాజ్యతంత్రం రణతంత్రంసాగింది. భారత యుద్ధానికి జూదం ఎలా ప్రాతిపదికో ఈ యుద్ధానికి కోడి పందాలు అలా మూల హేతువు. గురజాల వాళ్లు మాచర్ల వెళ్లి రాజ్యం నిర్మించుకున్నా-రాకపోకలు సాగుతూ సంబరాలలో అంబరాన్నంటే పొరపొచ్చాలు వచ్చి పాండవులు అడవికి వెళ్లినట్టే మాచర్ల వదిలి వలస పోయి. తర్వాత అక్కడ లాగా ఇక్కడ యుద్ధం. భారతానికి శ్రీకృష్ణుడిలాగా ఈ పల్నాటి కథకు బ్రహ్మనాయుడు. శకునిలా తంత్రం నడి పింది నాయకురాలు. కథ కంటే కథనంలో కదను తొక్కుతుంది శ్రీనాథుని కలం.

అక్కడ యుద్ధం జరుగుతుంటే ఇక్కడ బాలచంద్రుడు బొంగారాలు ఆడుతుంటాడు. ఆటలో బొంగరం వెళ్లి అన్నమ్మ అనే వైశ్య కాంతకు తగిలి ఆమె మూర్ఛ పోతుంది. తర్వాత తేరుకొని బాలచంద్రుడికి చీవాట్లు పెడుతుంది ఓరి దురాత్ముడా ! ఓరి దుర్మార్గ ! క్రిందు మీ దెరుగ కెరలు చున్నావు. గర్వ మేటికి నీవు....కలిగిన తినవలె కట్టంగవలయు....ముదిరె మదంబు నీమురిపెంబు క్రుంగ....త్రుళ్ళుచున్నావు దుష్ట చిత్తుండ....చూచెదు కనులకు సూదులగుచ్చ. మీ అయ్య లెల్లను మించిన బలిమిచేరి వైరులతోడ శ్రీయుద్ధభూమి ఉప్పొంగు చున్నవారు రిపుసేదుట వారిలో కలియు నీవడి కానవచ్చు పోతు సింహమురీతి పొదలుచున్నావు అని ఆమె చెరిగిపోస్తే-నయవిదుడైన బాలచంద్రుడు నొప్పి కల్గుటచే నోరాపలేని అనరానిమాటల ఆడితిగాని బొంగరం ఐదితాకెనిన్ను నా తప్పుమన్నింపు "నయభావమున" అని క్షమాపణ అడుగుతాడు.

అక్కడినుంచి తల్లి ఐతమ్మ వద్దకు వెళ్ళి ఎక్కడ యుద్ధం ఏమిటికథ అని అడుగగా ఆమె మూర్ఛబోతుంది. యుద్ధాన్ని భయంకరంగా వర్ణిస్తుంది. "ఘనకరీంద్రముల ఘీకారరావంబు సాంద్రతురంగ హేషా విజృంభణము రథనేమి సంకుల ప్రబల శబ్దంబులమిత పదాతి చయ అట్టహాసంబు భేరిడమామల ఫీళ్ళను మ్రోత" ఎలా సహిస్తావు నీవేదరణమేడ నీ బలమేడ? బాలురతో నాడు పగిది కాదోయి చెక్కులు మీటిన ఓందును పాలునుదురు మీటిన నూనెవెళ్ళెడును గంద్ర తనంబుల గైకోకు తనయ అని మందలిస్తుంది,

అయితే కుర్రాడు "నలగాము దెరుగును నాదు శౌర్యంబు-ఎదురెవ్వరే నాకు" అంటాడు పేరు పేరున ప్రశయరు దుని, అర్జుని, భీముని, హనుమను, రాముని పోల్చుకుంటాడు దానికామె ఆ అబ్బురాల కొడుకోసం అమ్మా అబ్బా ఎంత తపించారో చెబుతుంది. అయినా బాలుడు వినడు. ఆమె అతడ్ని అతని భార్య మాంచాల సెలవు తీసుకోమని చెప్పి పంపుతుంది. మగువ మాంచాల మరో మచ్చు తునక. ఆమె భర్తని దీవించి ఖడ్గం ఇచ్చి పంపుతుంది.

అసలీ బాలచంద్రుడు....గత జన్మల్లో లోహితుడు, ప్రహ్లాదుడు' సిరియాళుడు, అంగదుడు, కుశుడు, అభిమన్యుడు ··· నట ఇదంతా బాలల కథ, బాల మనోహరమైన గాథ.

ఘనుడైన శ్రీనాథ కవిరాజ రాజు
చెన్నుని కృపచేత చిత్తముప్పొంగి
బాలు విక్రమ ప్రావీణ్యమెల్ల
జనులకి వివరించె....

ఆసక్తితో దీనిని పాటించి చదివిన, వ్రాసిన వినిన బంధువులు పుత్రులు పౌత్రులు హెచ్చు సకల శుభములు సమకూరు. ఇక చదవండి.

# ఆరాధన వేదనల సౌబగుల శోధనల పళని

శృంగారానికి శ్రీమంతమైన శ్రీకారం చుట్టింది రాధా మాధవ శృంగారం కవుల కల్పనలో కమనీయ శిల్పంలో బంగారంగా తయారయ్యాయి. ఆ రాధా కృష్ణుల రాసలీలలు. అలాటి వాటిలో మిన్నగా ఎన్నతగింది "ముద్దు పళని" రాధికా స్వాంతనం.

ఇళ యశోద మేనకోడలు. వయసొచ్చి ఈడేరిన ఇళకు తొలి సమర్త సింగారాలన్ని చేసి వేడుక మీద వేడుకలు జరిపి చెప్పాల్సిన హెచ్చరికలన్నీ చెప్పి ఆపై ఇద్దర్నీ ఇళను కృష్ణుడినీ - పడకింటికి పంపుతుంది రాధ. అప్పుడు స్త్రీ సహజమైన ఈర్ష్యా సూయిలు ఆమెలో తలెత్తుతాయి. తానయి సింగారించి రంగారు బంగారు బొమ్మను నయగారాల గారాల రెమ్మను సింహ విక్రముడి చేతికి అందించి - ఆ మీదట.

సొమ్ము లియ్య వచ్చు సొమ్మంద మియవచ్చు.
ఇయ్యరాని ప్రాణ మియ్య వచ్చు.
తనదు విభుని వేరు తరుణి చేతికి నిచ్చి
తాళవశమె ఎట్టి దానికైన —

అనుకుని తలపోస్తుంది. అవేవంతలో తెల్లవారు జాము అవుతుంది. వెళ్ళి పిలిచి తలుపు తీయించి రాధ ఇళను బయటికి తెస్తుంది. రాధ లోపల ప్రవేశిస్తుంది. రాధ కోరిక నేరవేర్తుంది. ఆ మీదట రాధకృష్ణుల మధ్య చాలా సరసమైన సంభాషణ సాగుతుంది. సవతిలాగా ఇళను భావించి ఇళా కృష్ణుల శృంగారాను భవాన్ని రాధ ప్రశ్నిస్తే—ఇళను ఒక పూమొగ్గగా చెప్పి రాధా రామణీయకతను రాధ ప్రౌఢత్వాన్ని ఎంతో గొప్పగా వర్ణిస్తాడు. ఇళకు సేద దీరేలా

స్నానాలు చందన చర్చలు చేయిస్తారు. మాషి కాటుక ఎక్కడా మందు లేదని కమ్మని కస్తూరి పూస్తారు. నఖక్షతాలకు పునుగు కుంకుమ పైపూత వేస్తారు. ఇదంతా అయ్యాక యశోద సోదరుడు కుంభకుడు -ఇళ తండ్రి వచ్చి కూతుర్ని అల్లుడ్ని తన ఇంటికి పిలుచుకొని వెళతాడు.

రాధ సార విచారంలో పడ్తుంది. అతడి అంగాంగాన్ని వర్ణిస్తూ తలపోసుకుంటుంది. అతని పాదాలు, నడక, పెదాలు మితిమీరి పొగడ్తుంది. విష్ణువు అవతారం ఎత్తి కిష్టయ్య అయితే-శంఖం ఇప్పుడు కంఠమైందట. చక్రం నిడుమైందట - మోకాళ్ళు చేరేలా చేతులు సాగితే ఆ విషయం కళ్ళకు చెవులకు చెప్పాలని భుజాలు ఎగు భుజాలయ్యాయట అది చూడలేక నడుము దిగులుతో చిక్కి పోయిందట —

జానువును చేరు బాహులు సరవి చూచి
కనులు చెవులకు వివరింప గదియు వింత
పొలుపు వినగోరి తలయెత్తె భుజము లటుల
గానలే నైతి నడుమంత కౌను చిక్కె

ఎంత మధుర కల్పనలో ఎంత మధురంగా వర్ణిస్తుందో ఆ రాధ శ్రీకృష్ణుని మాటల తీరుని పొగిడిన మాటల్నే చూద్దాం.

తేటలుగా జిగి ముత్యపు
పేటలుగా పంచదార పేటలుగా పూ
తోటలుగా రా చిలుకల
మాటలుగా కంస వైరి మాటలు తనరున్.

నిజంగా ముద్దు పళని కవిత్వం ఇలాగే ఉంటుంది. అతని కెమ్మోవిని వర్ణించే తీరు చూడండి తానుగా ఆ మాధుర్యాన్ని గోలినంత మధురంగా చెప్పింది.

కావి కాదది విడికెంపు దీవికాని
దీవి కాదది అమృతంపు బావి కాని
బావి కాదది కపురంపు తావికాని
తావి కాదది శౌరి కెమ్మోవి కాని —

భళా అన్పిస్తుందీ కల్పన! శౌరి ముక్కట! మన్మధ వనంలో మొలిచిన వెదురట! నాసిక స్మరవన వంశంబు —

అలా ఆయన అణువణువునూ మనోహరంగా (మనసుని దోచుకునే విధంగా) తలపోసి తలపోసి చిలుకలతో తన వెత చెప్పుకుంటుంది రాయ బారం వెళ్ళమంటుంది. ఆ చిలుక కూడా రాధ చేతిలో మాటలు నేర్చిన రాచిలక కాబట్టి తొడ కొట్టి బయలు దేరుతుంది.

ఇలా ఇక్కడ రాధ మితిమీరిన వియోగంతో చంద్రుడ్ని మలయా నిలాన్ని మదనుడ్ని శుక పికాలను పేరు పేరునా తిడ్తుంది.

గురుసతిని బట్టి విప్రయోగులను కొట్టి
తమ్ముల నడంచి పక్షపాతము ఘటించి
కాలగతి నుండి ఇదె రాజగట్టు నుండి
పడెదధోగతి రౌరవ ప్రాప్తి చెంది—

ఇది చంద్రుడ్ని తిట్టే తియ్యని పద్యం

గురుసతిని.... గురువైన బృహస్పతి భార్యను— పెద్దస్త్రీని.... తన కంటే వయసులో పెద్దదైన పెళ్ళయిన స్త్రీని చేపట్టాడు వియోగుల విరహాగ్నిలో పడగొట్టాడు తమ్ముల అడంచి తమ్ములు.... పద్మములు ముడిచేట్టుచేసి...నాడు. కాలగతి.... ఎంత సమయమైందో చంద్రుడి నడకని బట్టి రాత్రిపూట నిర్ణయిస్తారు. ఇదేభావాన్ని చేమకూర వెంకట కవి తన విజయ విలాసంలో 'వేళకొలదుల్ గదనీనడకల్' అని చమత్కరించాడు....రాజు ...శివుడి శిరస్సు నుండి అధోగతి పొందాడు ...కాలగతికి లోనై కృష్ణపక్ష, శుక్లపక్షస్థితి అనుభవించాడు.

ఇలా పేరు పేరునా నిందించాక ఇంకా దూతగా వెళ్ళిన చిలక తిరిగి రాదేమో అని చింతిస్తుంది రాధ.... వెర్రెక్కిన దానిలా ప్రలాపిస్తున్న సమయంలో చిలక తిరిగొస్తుంది అక్కడ శ్రీకృష్ణదేవుడి "శృంగారాన్ని" బట్టబయలుచేస్తుంది తనవశుడై పరవశుడైవున్న అతన్ని తనకు వదలి పెట్టమని రాధను అడిగిం దంటూ చెబ్తుంది చిలక.

దాంతో రాధ భగ్గుమంటుంది ఇళను రకరకాలుగా హీనపరచి నింది స్తుంది. తొలితొలినాళ్ల సుఖంతో తోయజాక్షుడ్ని లొంగదీసుకుని ఇంత చేస్తుందా ?

తనదు మట్టెంత తానెంత? తానె ఇంత
చేయనూచిన నేనెంత సేయరాదు
వేలు వాచిన రోలంత విరివి అయిన
రోలు వాచిన నది ఎంత బోలుగాదు.

అంటూ వెక్కిరిస్తుంది వింతగా

అలా ఇలా తిరిగిన కథ తిరిగి ఆయన చెంత చేర్తుంది కడుపు నిండిన బేరమైనా సరసుడు కాబట్టి రాధికా సాంగత్యాన్ని వ వంతతో తలుస్తాడు.

మునుపు నిద్దుర లేదయ్యో ముదిత నెనసి
వెనుక నిద్దురలేదయ్యో వెలది బాసి
ఏమి చెప్పుదు మన్మథ స్వామి మాయ
పుంచకయె ముంచె నొంచకయె నొంచె

వియోగానంతరం కలుసుకుని ఒకరి నొకరు ఎత్తి పొడుచు కుంటారు.

నలువ శిరంబు ముట్టినను నల్లని వానిని నమ్మవచ్చునే అంటుంది రాధ.

వలచి పాయుట పగవారికైననుకాదు అంటాడు అతడు నువ్వు విష కంధరు (శివుడు) నెచ్చెలివి - విషకుచ చనుబాలు (పూతన) తాగావు. విష నిధిలో (సముద్రంలో) విషధరునిపై (పాముపై) శయనించే విషరుహ (జలజము) నయనుడైన నీకువిషమ (విషయ) గుణము ఎక్కడికి పోతుంది అని నిలదీస్తే దాసరి తప్పు దండంతో సరి అని, ఆయన పాదలమీదపడ్తాడు. దాంతో కథ కంచికి.... కాదు కాదు కంచుకము విడిచే పడకింటికి వెళ్తుంది. అడుగడుగునా శృంగారాన్ని బంగారంలా పద్యంలో పలికించిన ముద్దుపళని భళి అనదగ్గ కవయిత్రి.

# వెచ్చదనం తెచ్చిన మచ్చ

"ఉష్ణాని హోమాగ్ని పూదమంటారునాన్నారు ! మనకెక్కడ తీరిక ! విరహంతో జ్వరతాపంతో వుస్సురనగలం కాని! ప్రొద్దున్నేలేచి సంధ్యా వందనం చెయ్యమంటుంది అమ్మ ! అంత పొద్దున్నే నిద్దరెలా లేస్తాను.... బాగా ప్రొద్దు పోయేదాకా వెలివాడల్లో విటవాదాలు తీర్చివచ్చి పడుకుంటానా వెర్రివాళ్ళు వేదాంత చర్చలకు రమ్మంటారు ! తీర్థంపుచ్చుకోరా అంటుంది అమ్మ ! వారవనితా జనతా మానస సూనసాయకుడ్ని అధరామృతంలోని ఆనందం.... హాయి తీర్థంలో ఎక్కడుంది. శంఖు చక్రాంకితాలో—మరేవో వేసుకో మంటారు నాన్న.... వలయాలి గోరుగిచ్చులతో (నఖక్షతాలు !) పవిత్రం అయిన శరీరానికి ఈ వైష్ణవ చిహ్నాలెందుకో— వెర్రివాళ్ళు—వెర్రి చేష్టలు—

మా తాత ముత్తాబు ఎంతో కూడపెట్టారు. దాన్నిమనం జల్సాగా ఖర్చు చేస్తున్నాం ! అయినా నాకు పంటదిగులు ఇంటి దిగులు ఎందుకు ? మా నాన్న గారున్నారు అన్నీ చూస్తారు. మనకేం గొడవ ! మనమంటే అందరికీ గౌరవం! మంచివాడని మంచినడత గలవాడని త్యాగశీలుడనీ—అంతేనా - మనం నోరెత్తి మాటాడ్తూవుంటే అంతా చెవులు రిక్క పొడుచుకుని వింటారు. అదంతా మానాన్న సభాపతిగారి చలవేలెండి !

మాకళింగ సీమలో పిఠాపురం సీమాభరణం. అది ఘనతకూ మాన్యతకూ వన్నె తెచ్చింది ! పులు కడిగిన ముత్యంలా తెల్లని అంగీ ధోవతి పై పంచె సింగారించి నేను రాచబాటలో నడుస్తూ వుంటే సఖులు పరిహాసకులు ఎప్పుడూ వెంటే వుంటారు.

మా అమ్మా నాన్నా ఎప్పుడో చిన్నప్పుడే నా పెళ్ళి జరిపించారు. అయినా నాకు మా ఆవిడ ముఖం చవితి చందురుడే ! విదియ నాటి చంద్రుడిలా వేశ్యాలలామ ఉండగా ఆవిడెందుకు మరి ! అయినా ఈవెల యాళ్ళున్నారే—అమ్మ బాబోయ్ వాళ్ళెంత అందగత్తెలో వాళ్ళ తల్లులు (వేశ్యమాతలు) అంత జగ

జంతలు ! దిన వెచ్చమని నా ఒంటి మీదున్న సొమ్ములు తీసేసుకున్నారు. మా అమ్మ ఆభరణాలు లాగించారు. మా నాన్నగారు కుదువ పెట్టుకున్న పత్రాలు తీసికెళ్ళి ఎంతకో కొంతకు అమ్మి తెమ్మన్నారు. అంతే నా ! మిండవడ్డికి అప్పు చేయించారు

ఆలా మనం ఓ వెలుగు వెలిగాం !

వెలుగు తగ్గి - కూటికి గుడ్డకు వీళ్ళనూ వేళ్ళనూ అడుగుతూ వుంటే పూలమ్మిన చోట కట్టెలమ్ముతున్నాడ్రా అని కల కల నవ్వారు.

నవ్వి పోదురు గాక నాకేటి సిగ్గు !

ఎక్కడ ఖాళి అయినా ఇల్లు ఖాళి కాదుగా ! ఎంత పొమ్మన్నా ఇల్లో ఇల్లాలు పొమ్మనరుగా ! అందుకే కొంపకు చుక్క తెగిపడిన రీతిన చేరేసరికి అక్కడికి అప్పటికే మా అక్క వొచ్చింది. మా అక్కకు నేనంటే ఎంత ప్రేమ! సీమంతపు పెండ్లి కొడుకువు కమ్మని హేతు గర్భితంగా ఆశీర్వదించింది. ఆమె కను సైగతో మా ఆవిడ "నా శ్రీపాద ద్వయము కడిగి" ఆహ్వానించింది. ఆ మీదట నేను మా బావగారు మానాన్న అందరం కలసి భుజించాం.

ఆ మీదట మా అక్కగారు 'పద్మ కర్ణిక కొలువున్న పద్మవోలే' కూర్చుండి బిడ్డకు చను గడుపుతూ నన్ను రమ్మని నా సిగ విడదీసి దువ్వుతూ, నన్నూ దువ్వుతూ అంది.

"వేద పాఠానికి భంగం అవుతుందని మావూరు రాలేదా ? నిన్ను చూడాలని "చక్షూ రాజీవ యుగం" వాచిపోయింది. మీ బావ కూడా చంద్రు పొడుపునకు చకోరుంలా వేచివున్నాడు — అయినా స్సాలగ్రామ ఖనిన్ జనించునె కదా జాత్యల్ప పాషాణముల్ అన్నట్లు నువ్వు చేసేవేం బావోలేవు రా బాబూ !" అంది.

ఆలా అలా ముక్క చీవాట్లు పెట్టింది.

> వీరావేశము దాల్చి సర్వధనమున్ వెచ్చింతు కాకేమి? ము
> క్కారుంబండు నఖండ సేతు వ్రతముల్ కాశ్మీర ఖండంపుకే
> దారంబుల్ తెగ నమ్మ చనునే నిర్ధారుండవే? వెన్నవె
> వార్పున్ లేరె సహోదరాదులు కులధ్వంసంబు నీ కర్మమే! -

అంది అంతటితో ఆగకుండా కావాలంటే - కామ వికార మాత్మనవ గాఢత దాల్చిన ఏని - విప్ర కన్యామణులన్ సహస్ర మయినన్ వరించరాదే!" అంది వర్రిది శృంగారానికి ఇల్లాలా చెల్లుతుంది! అదంతా వేశ్యలకే చెల్లు!

అయినా అక్కగారి ముందు నోరెత్త లేక మళ్ళీ మామూలుగా రాజాలయానికి రాక పోకలు చేస్తూ - కుల వధూరత్నాన్ని గుస్తరిస్తూ - మానాన్న ఉద్యమనీయం నేనే ఉదుకుతూ అంగడికి వెళ్ళి గ్రామ కార్యం తీరుస్తూ గడిపాను. ఆదంతా జనం నిజం అనుకున్నారు.

ఓ రాత్రి ఇంట్లో వున్నదంతా పూడ్చి-పడు పడుకకు కూడా చెప్పక గాఢతర తమోయంలో ఇల్లు విడిచాను. నే వెళ్ళాక • వరెంత ఏడ్చారో నాకెందుకు అయితే ఇంత కష్టపడి దోచిన దాన్ని దారి దోపిడీ గాళ్ళు దోచుకుని నన్ను చావ గొట్టి వెళ్ళారు.

అప్పుకు ఓ కాపు కొడుకు నన్ను చూసి ఇంటికి తెచ్చి చికిత్స చేయించి తన ఇంట్లో నే ఉంచుకున్నాడు. ఇంట్లో అడ్డం లేకుండా తిరగనిచ్చాడు.

వాడి భార్య వుందే అది! అదెంత అందగత్తో! నేనంటే ఎంత ప్రాణమో అందుకే తేరకు తేర దక్కి నిటులీ బంగారు కుండని చంకలు కొడ్తూ- ఓ రాత్రి దాని మగడు నిద్ర పోతున్న వేళ ఇంట్లోంచి నాతో వచ్చింది – కాపు కోడలు తన కంచంత కాపురాన్ని పాలవంటి కులాన్ని పాడు చేసింది.

నాతో కొన్నాళ్ళు సంసారం చేసింది. ఆ మీద పరలోకం ప్రాప్తించింది.

వ్యాపారంబున - ఒంకు వడ రూపా జీవ రాజాననన్ తాపించచ్చద గుచ్ఛ సచ్ఛవి మదాంధన్ - బంభర శ్రోణి, వీణా పాణిందపు వాణి నొక్క ప్లవ కన్యన్ కూడి క్రీడింపగా —

ఆ కళత్రం వల్ల పుత్ర లాభం కలిగింది. సంసారం ఈదడానికి ఓ రోజు నేను ఇల్లు విడిచి వెళ్ళినపుడు "అగ్ని ప్రమాదా"నికి లోనై నా భార్య, పిల్లలు, ఇల్లు అన్నీ భస్మమై పోయాయి.

అప్పుడు నా బాధ ఏం చెప్పమంటారు. మీరే చెప్పండి?
ఎల్లరు ఎల్ల చోధనము లిచ్చి మృగాక్షుల కొంద్రు కాని యో
పల్లవ పాణీ! ఏ పరమ పావన వంశము ఇచ్చి కొంటి నీ

నల్లని రూపు నిక్కమని నమ్మి ! ధ్రువంబదికాక నేడు వి
ద్యుల్లతి కాధికాభినయ ధూర్వహమౌట ఎరుంగ నింతయున్.

కాదంటారా ? డబ్బిస్తారు - ఇల్లిస్తారు - పొలం - నగలు ఇస్తారు. కానీ నేనో - నా పరమ పావన వంశం ఇచ్చాను.

ఎందుకని ? ? దీని నల్లని రూపు నిక్కమని నమ్మడంవల్ల? కానీ అది ఈరోజు మెరుపు తీగలా మెరిసి విరిసి మాయమై పోయింది ! అదెంత బాధ కాదు ? అంతేనా ? చూసే వాళ్ళంతా—

ఈ కడ జాతి నాతి కిహిహీ మహిదేవుడు చిక్కెనంచునన్
రాకకు పోకకున్ జన పరంపర కెఃపగు చూడ్కి చూచి అం
బూకృత మాచరించుటకు బుద్ధి తలంక—కలంక ముక్తచం.
ద్రాకృతి బోల్చు నీ సుఖము నంద మృత స్థితి గాంచి మించుటన్-

అలా ఎంత వగస్తే నేం !పోయిన వాళ్ళు తిరిగి రారు కదా! ఆ బాధతో వ్యథ గడిచి పూరూరా తిరుగుతూ విష్ణువు దశావతారాలెత్తినట్లు అన్ని బాధలు పడ్డాను ఆ మీద పస్తులతో ప్రాణం పిడిచాను.

అప్పుడు యమ దూతలు వచ్చారు. విష్ణుదూతలు వచ్చివాళ్ళ నుంచి నన్ను రక్షించారు.

స్వర్గానికి తీసికెళ్ళారు. ఇంతకూ నేనెవరంటారా? నిగను శర్మను - నా కథ ఇంకా విపులంగా కావాలంటే పాండురంగ మాహాత్మ్యం అని తెనాలి రామకృష్ణ కవి రాసిన పుస్తకంలో మూడో ఆశ్వాసంలో చూడండి !

—౦—

